## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



# సుప్రసిద్ధుల జీవిత విశేషాలు

జానమద్ది హనుమచ్ఛాస్త్రి





# ముందుమాట

మాన్యమిత్రులు శ్రీ ఎన్. శివరామరెడ్డి గారు 'రైతులోకం' మాసపత్రిక ప్రధాన సంపాదకులుగా దాదాపు మూడేళ్ళు పనిచేశారు. రైతులకుపయుక్తమైన రచనలతో పాటు మహనీయుల జీవిత విశేషాలు గల వ్యాసాలు కూడా వుంటే బాగుండునన్న అభిప్రాయంతో సుప్రసిద్ధుల జీవిత విశేషాలను ధారావాహికంగా వ్రాయమని కోరారు. వారి కోరిక మేరకు ఇరవై పైగా వ్యాసాలు వ్రాశాను. అవన్నీ సచిత్రంగా 'రైతులోకం'లో వెలువరించినందుకు నమస్సులు.

పుస్తకంగా ప్రచురించి ప్రోత్సహించిన విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారికి నా కృతజ్ఞతలు.

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

# ఇందులో

ఆంధ్రులకు గర్వకారణమైన మహానటుడు

# బళ్ళారి రాఘవ



పాత్రల మనస్తత్వాలను బాగా అర్థం చేసుకుని, భావసంఘర్షణను ప్రదర్శిస్తూ నటనకు వెలుగు బాటలు వేసిన బళ్ళారి రాఘవ ఆంధ్రులకు చిరస్మరణీయుడు.

ఆధునిక ఆంధ్రనాటకరంగం బళ్ళారి రాఘవ పుట్టుకతోనే ప్రారంభమైంది. మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాల నాటక సమాజాలు ఆంధ్రదేశంలో పలుచోట్ల ప్రదర్శనలిస్తూవుండేవి. ఆ నాటకాల ప్రభావంతో ఆంధ్రదేశంలో కూడా నాటక సమాజాలు వెలిసాయి.

బారెడు రాగాలు, తబలామోతలు లేకుండా భావ ప్రధానమైన అభినయంతో ప్రేక్షకులను రంజింపజేసినవాడు బళ్ళారి రాఘవ.

స్త్రీ పాత్రలు స్త్రీలే ధరించాలని చాటి చెప్పి, విద్యాధికులైన స్త్రీలను రంగస్థల మెక్కించి వాస్తవికతకు పట్టం కట్టిన విప్లవ నటుడు బళ్ళారి రాఘవ.

జాతి ప్రగతికి, మూఢాచారాల నిర్మూలనకు నాటకరంగం అత్యంత ప్రధానమైనదని ప్రకటించి, ప్రతి పట్టణంలోను అన్ని హంగులూకల నాటక రంగం స్థాపించాలని ఎలుగెత్తి చాటిన ప్రజానటుడు బళ్ళారి రాఘవ.

బళ్ళారి రాఘవ 1880 ఆగస్టు 2వ తేదీన తాడిపత్రిలో జన్మించాడు. తండ్రి నరసింహాచార్యులుగారు బళ్ళారి మునిసిపల్ హైస్కూలులో తెలుగు పండితులు. మేనమామ ఆంధ్ర నాటక పితామహ ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారు బ లో న్యాయవాదిగా వుండేవారు.

బళ్ళారి మునిసిపల్ హైస్కూలునుండి మెట్రిక్యులేషన్ పరీక్ష పాసైన రాఘవ మద్రాసులో పట్టభద్రులయ్యారు. బాల్యంనుండి నాటకాలంటే ఎంతో ఆసక్తికల రాఘవ మద్రాసులో, పెక్కు ఇంగ్లీషు నాటకాల్లో పాల్గొన్నాడు. ప్రముఖ ఆంగ్లనటుల మెప్పులందుకున్నాడు. మద్రాసులో బి.యల్. పరీక్ష పాసయ్యాడు.

మద్రాసు నుండి వచ్చిన తర్వాత మేనమామ వద్ద జూనియర్‌గా వుంటూ నాటకాల్లో అభినయించేవాడు. ధర్మవరం రామకృష్ణమాచార్యుల వారి సరసవినోదినీ సభలోనూ, కోలాచలంవారి సుమనోరమ సభలోను అభినయించేవాడు. ఈ సమాజాలు బళ్ళారిలోనేకాక మద్రాసు, హైదరాబాదు, విజయవాడ,బెంగుళూరు నగరాల్లో ప్రదర్శనలిస్తుండేవి.

రాఘవకు పౌరాణిక నాటకాలకంటే చారిత్రక, సాంఘిక నాటకాలపట్ల ఎక్కువ అభిరుచి వుండేది.

కోలాచలం వారు రచించిన 'విజయనగర పతనము'లో రాఘవ పఠాన్ రుస్తుం అభినయం అత్యద్భుతంగా వుండేది. ఈ నాటక ప్రదర్శనవల్ల హిందూ ముస్లిమ్ సఖ్యతకు భంగం కలుగుతుందన్న అనుమానంతో మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం ప్రదర్శనను నిషేధించింది.

చాణక్య పాత్రధారిగా రాఘవ మహానటుడని ప్రశంసింపబడ్డాడు. నవరసాలు ఒకటి తర్వాత ఒకటి తరుముకొని వస్తున్నాయా అనిపించేదాయన నటనలో.

రామదాసు పాత్రలో భక్తిభావాన్ని చాలాగొప్పగా చూపేవాడాయన. నాటకంలో స్వయంగా కొన్ని సన్నివేశాలను కల్పించి ప్రదర్శించేవారు. రచనలో కూడా సమయానుకూలంగా మార్పులు చేసేవారు.

తానీషా, రాముణ్ణి నాకు కూడా చూపించమని రామదాసును నిర్బంధిస్తాడు. అపుడు రామదాసు, "పిచ్చివాడా, ఎవరి రాముడు వారిలో వుంటాడు – దేవుడొక్కడే. భక్తుల విశ్వాసాలకు తగినట్లు రూపం ధరిస్తాడు. రామ్–రహీమ్, క్రీస్తు, బుద్ధుడు– ఇవన్నీ ఆయన రూపాలు అంటు మతసామరస్యాన్ని ప్రదర్శించేవారు.

జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతున్న కాలమది. రామదాసు జైలులో వుంటూ 'ఆత్మసిద్ధి పొందడానికి కారాగృహవాసమే ప్రథమ సోపానం' అంటాడు.

తానీషా ఆదేశం మేరకు భటులు రామదాసును జైలుకు తీసుకొని వెళ్ళారు. వెళ్ళేముందు భార్య కమలాంబ భర్త నుదుట కుంకుమ పెడుతుంది. ఖద్దరు శాలువా కప్పి, తెల్లని టోపీ అతని తలపై పెట్టి హారతి యిస్తుంది. ఆకాలంలో గాంధీటోపీ

వుండేదో లేదో కాని, రాఘవ యీ సన్నివేశాన్ని కల్పించాడు. సత్యాగ్రహం చేసి, జైలుకు వెళ్తున్న ఆకాలంలో యీ సన్నివేశం ఎంతో ఉత్తేజంగా ఉండేది.

1919 జనవరిలో బెంగుళూరులో జరిగిన ఫెస్టివల్ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్‌లో రాఘవ పఠాన్ రుస్తుంగా ప్రదర్శించిన అభినయాన్ని రవీంద్రనాథ్‌టాగూర్ ఎంతగానో మెచ్చుకొన్నాడు.

1927లో గాంధీజీ బెంగుళూరు సమీపంలోని 'నందీహిల్స్'లో విశ్రాంతి తీసుకుంటున్నారు. పండిత్ తారానాథ్ ( రాఘవ ఆధ్యాత్మిక గురువు) రచించిన హిందీ నాటకం 'దీనబంధు కబీర్' నాటకాన్ని చూడవలసిందిగ, గాంధీజీని బెంగుళూరుకు ఆహ్వానించారు. కొన్ని నిమిషాలు చూద్దామనుకొన్నాడు గాంధీజీ. గంట అయినా నాటకాన్ని చూస్తూనే వున్నాడు గాంధీజీ. కార్యదర్శిగా వుండిన రాజాజీ, 'ప్రార్థనకు వేళైంది' అని గుర్తు చేశాడు. 'మనం ప్రార్థనలోనే వున్నాంకదా?' అంటూ గాంధీజీ రాఘవ నటన అద్భుతం అన్నాడు. 'రాఘవ మహరాజ్‌కీజై' అన్నాడు గాంధీజీ.

1921 - 24 మధ్య రాఘవ ఆంధ్రప్రాంతంలోని పలునగరాలలో ప్రదర్శనలిచ్చాడు. 1927లో రంగూన్‌లో కూడా ప్రదర్శనలిచ్చి పేరుగాంచాడు.

1928 మే 8వ తేదీన రాఘవ ఇంగ్లండుకు బయలుదేరాడు. లండన్‌లో పెక్కు నాటకాలను చూచి, ఆంగ్లనటుల పరిచయం సంపాదించుకొన్నాడు. విఖ్యాత నాటక కర్త, కళావిమర్శకుడు జార్జి బెర్నార్డ్‌షాతో రాఘవ కళల గురించి విశ్లేషణ జరిపాడు. "కళల గురించి తెలుసుకోవడానికి మీరు ఇక్కడికెందుకు వచ్చారు? మేమే ప్రాచ్యదేశాలకు రావాలి!" అన్నాడు షా. "మీరు దురదృష్టం కొద్దీ భారతదేశంలో పుట్టారు. ఇంగ్లండులో పుట్టివుంటే షేక్స్పియర్ అంత గొప్పవారై వుండేవారు "అన్నాడు.

రాఘవ మిత్రుల ఒత్తిడిపై 1936లో సినిమా రంగంలో ప్రవేశించాడు. హెచ్.ఎం. రెడ్డిగారి 'ద్రౌపదీ మానసంరక్షణము'లో దుర్యోధనుడుగా నటించారు. గూడవల్లి రామబ్రహ్మంగారి 'రైతుబిడ్డ'లోను, రాజరాజేశ్వరివారి 'చండిక'లోను నటించాడు. సహజ స్వతంత్రనటుడైన రాఘవ సినీ రంగంలో ఇమడలేకపోయాడు.

రాఘవ సమయస్ఫూర్తి చాలగొప్పది. ఒకసారి 'చంద్రగుప్త' నాటకం విజయవాడ దుర్గాకళామందిరంలో ప్రదర్శింపబడుతూవుంది. చాణక్య పాత్రధారి రాఘవ ప్రళయకాల రుద్రునివలె నందులపై ప్రతీకారంకోసం తపిస్తున్నాడు.స్మశానరంగం అది. అంతలో ఆకస్మికంగా ఒకకుక్క రంగస్థలంమీదికి వచ్చింది. రాఘవ ఏమాత్రం చలించక కుక్కను చూస్తూ 'శునకరాజమా, నీకు కూడా నేను లోకువయ్యానా?' అన్నాడు. కుక్క కాసేపు వుండి వెళ్ళిపోయింది. ప్రేక్షకుల సంభ్రమాశ్చర్యాలతో రంగమందిరం దద్దరిల్లింది.

రాఘవ వృత్తిరీత్యాన్యాయవాది. తాను నమ్మిన సిద్ధాంతాలమేరకు న్యాయంగా వున్న కేసులను మాత్రమే చేపట్టేవాడు క్రిమినల్ లాయర్‌గా బాగా పేరుతోపాటు ధనాన్ని ఆర్జించాడు.

కాని ఆయన మిగుల్చుకున్నదేమీలేదు. నాటకకళాభివృద్ధికే వినియోగించాడు. న్యాయవాదిగ, కళాకారుడుగ పేరుపొందిన రాఘవను 1933లో కొందరు మిత్రులు బళ్ళారి మునిసిపల్‌కౌన్సిల్‌కు పోటీచేయమని ఒత్తిడి చేశారు. రాఘవ, మరికొందరు మిత్రులు, ప్రముఖవ్యాపారి ముల్లంగి కరిబసప్ప మున్నగువారు చాకలి వీధిలో ప్రచారానికి వెళ్ళారు. మిత్రులు ఓటర్లకు రాఘవను పరిచయం చేసి వారికి ఓటువేయమని కోరారు. ఓటర్లు మౌనంగా వుండిపోవడంతో కరిబసప్పగారికి కోపం వచ్చి ఓటర్లను తిట్టారు. రాఘవ మనస్సు చివుక్కుమన్నది. వెంటనే ఇంటికివచ్చి తమ నామినేషన్ పత్రాన్ని ఉపసంహరించుకొన్నారు. వారు ఆనాటి నుండి ప్రత్యక్షరాజకీయాలకు దూరమైనారు.

రాఘవ కవిపండితులకు అత్యంతాప్తుడు. ఆయన ఇంట్లో సాయంకాలం బళ్ళారిలోని కవిపండితులు సమావేశమై కళ, నాటకం వగైరాల పఠన లేదా చర్చలలో గడిపేవారు. సరసులు అందరినీ ఎంతో ప్రేమతో పలుకరించేవారు.

బళ్ళారి టీచర్స్ ట్రెయినింగ్ స్కూలులో వున్నపుడు, మా పెదనాన్న భాస్కరాచార్య రామచంద్రస్వామి (కవి, పండితుడు) గారితో పాటు రాఘవ గారిని పలుమార్లు కలుసుకొనే అదృష్టం నాకు కలిగింది. వారు నటించిన నాటకంలో చిన్న పాత్రధారిని నేను.

కులమతాల సంకుచితత్వాలకు అతీతుడాయన. హరిజన బాలురకోసం సొంతఖర్చులతో బడిని పెట్టించాడు. పండుగరోజుల్లో హరిజన విద్యార్థులందరికీ తన ఇంట్లో విందు చేసేవాడు.

కళలకోసం ఎంతో ఉదారంగా పైకం ఖర్చు చేసిన రాఘవ పెళ్ళిళ్ళ పేరిట జరిపే దుబారా ఖర్చులకు దూరంగా వుండేవాడు. పెళ్ళికి రు. 250 మించి ఖర్చుచేయరాదనేవాడు. ఆహ్వాన పత్రికలు చేతివ్రాతలో పంపేవాడు.

రాఘవ స్మృతి చిహ్నంగా బళ్ళారిలో కళామందిరం నిర్మింపబడింది. కేంద్ర ప్రభుత్వం, ఆయన శతజయంతిని పురస్కరించుకొని 'పోస్టల్ స్టాంపు' విడుదల చేసింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యిటీవల ట్యాంక్‌బండ్‌పై రాఘవ విగ్రహాన్ని నెలకొల్పింది.

టక కళాభివృద్ధికి రాఘవ చేసిన సూచనలు కార్యరూపం దాల్చినపుడే ఆయనకు నిజమైన స్మృతి చిహ్నం ఏర్పడగలదు.

# ఆంధ్రులకు చిరస్మరణీయుడైన ఆంగ్లేయుడు

# సి.పి. బ్రౌన్ (1798 - 1884)



BIRTH 10-11-1798 **C.P.BROWN** 12-12-1884 DEATH

మని యుండెడు జనమ్మెల్లను . చని పోయిన వారి పుణ్య సత్కథలెలమిన్,
వినవలె, కనవలె, మనవలె, ననిమిషులకునైన దెలియ దంత్యము వేమా."

"LET US LISTEN TO THE HISTORIES OF THOSE WHO HAVE LIVED OF OLD, AND ATTENTIVELY
READ THE HOLY LEGENDS REGARDING THOSE WHO ARE DEAD, LET US LIVE ACCORDINGLY.
THE GODS THEMSELVES KNOW NOT WHAT SHALL HEREAFTER HAPPEN."

భారతదేశ చరిత్రలో ఆంగ్లపాలనా కాలం అనటం కంటే ఆంగ్లపాలకుల దోపిడీ కాలం అనటం సమంజసంగా వుంటుంది. రాజకీయ బలాన్ని మరింత లాభములకు వినియోగింపవలెనన్నదే నాటి కంపెనీ ప్రభుత్వ లక్ష్యం. మరుభూములలో మంచినీటి

బావులవలె కొందరు ఆంగ్లేయులు భారతీయ సంస్కృతిని నాగరికతను అర్థం చేసుకొని మనకు మహోపకారం చేశారు. వారిలో తెలుగు ప్రజలకు సంబంధించినంతవరకు చిరస్మరణీయులు నలుగురు.

ఆనాడు దత్తమండలాలుగా పేరుగాంచిన రాయలసీమ జిల్లాల మొదటి కలెక్టరుగా, యీ ప్రాంతంలో శాంతిభద్రతలను నెలకొల్పి, పాళెగాళ్ల అరాచకాలను అణచివేసి, 'మండ్రోలయ్య' గా ప్రజల మన్ననలందుకున్న వాడు సర్‌థామస్ మన్రో.

మన దేశ చరిత్రకు కావలసిన ముడి సరుకును కైఫియత్తుల రూపంలో అందించిన మహనీయుడు కల్నల్ కాలిన్స్‌మెకెంజీ.

అపారమైన గోదావరీ జలాలకు అడ్డంగా ఆనకట్ట నిర్మింపజేసి తెలుగు ప్రజలకు అన్నదాతగా విఖ్యాతుడైనవాడు సర్ ఆర్థర్‌కాటన్.

మినుకుమినుకు మంటున్న తెలుగు వాఙ్మయదీపాన్ని స్నేహసిక్తం చేసి ప్రజ్వలింప చేసిన ఆంధ్రభాషోద్ధారకుడు సి.పి. బ్రౌన్.

ఈ నలుగురు కారుమేఘాల్లో మెరుపుల్లాంటి మహనీయులు.

ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ తండ్రి రెవరెండ్ డేవిడ్ బ్రౌన్ క్రైస్తవ మత ప్రచారకుడిగా 1786 లో కలకత్తా వచ్చాడు. హిందూ మతాచారాలను అవగతం చేసుకొనే లక్ష్యంతో భారతీయ భాషలను నేర్చుకున్నాడు. ప్రాచ్యభాషా సంస్కృతులపట్ల ఆదరాభిమానాలు కలవాడు డేవిడ్ బ్రౌన్.

డేవిడ్ బ్రౌన్, కాలే దంపతుల రెండవ కుమారుడిగా సి.పి. బ్రౌన్ 1798 నవంబరు 10వ తేదీన కలకత్తాలో జన్మించాడు. తండ్రి మరణం తర్వాత బ్రౌన్ కుటుంబం ఇంగ్లాండుకు వెళ్ళిపోయింది. ఇండియాలో, ఈస్టిండియా కంపెనీ ఉద్యోగానికి మొదటి మెట్టుగా బ్రౌన్‌ను లండన్ (హెర్ట్‌ఫర్డ్)లోని హెయిల్ బరీ కాలేజీలో చేర్పించారు. ఈ కాలేజీలో సంస్కృతం బోధించేవారు. సంస్కృతం లో ఉత్తీర్ణులైన విద్యార్థులకు 'బంగారుపతకాలు' యిచ్చేవారు. ఆ పతకం అంచు చుట్టూ"తత్ సుఖం సాత్వికం ప్రోక్తం ఆత్మబుద్ధి ప్రసాదజం" అన్న సంస్కృత సూక్తి ఒకవైపు, మరోవైపు 'శ్రీవిద్యా వరాహ' అని చెక్కబడి వుండేది. అవిధంగా బ్రౌన్ సంస్కృతాభ్యాసం సాగించి బంగారు పతకం పొందాడు.

కంపెనీ ప్రభుత్వం బ్రౌన్ సోదరులిద్దరినీ ఎన్నుకొని బెంగాల్ సర్వీసుకు, మద్రాసు సర్వీసుకు ఎంపిక చేసింది. తెలుగు వారి అదృష్టం కొద్దీ సి.పి. బ్రౌన్ మద్రాసుకు కేటాయింపబడ్డాడు.

1817లో ఆగస్టు 4వ తేదీన బ్రౌన్ మద్రాసులో కాలుపెట్టాడు. అప్పటికి ప్రపంచంలో తెలుగు భాష ఒకటి వుంది. అనేది కూడా అతనికి తెలియదు. అప్పటికాతని వయసు పందొమ్మిదేళ్ళు. ఫోర్ట్‌సెంట్ జార్జి కాలేజిలో శిక్షణ కోసం చేరాడు. వెలగపూడి కోదండరామ పంతులు వద్ద తెలుగు అక్షరాలు నేర్చుకొన్నాడు. పదహారు నెలల్లో

తెలుగులో మంచి ప్రావీణ్యం సంపాదించాడు. తెలుగు నేర్పే పండితులకు ఇంగ్లీషు బొత్తిగా తెలియని రోజులవి.

1820లో సర్ థామస్ మన్రో మద్రాసు గవర్నరుగా చేరాడు. కంపెనీ ఉద్యోగులందరూ దేశ భాషలలో ప్రావీణ్యం సంపాదించాలనీ, ప్రజల భాషలోనే ప్రభుత్వ వ్యవహారాలను సాగించాలని ఆదేశించాడు. మన్రో తన 'కాన్వొకేషన్' ఉపన్యాసంలో చేసిన ప్రబోధం బ్రౌన్ మనసులో మంత్రోపదేశంగా నాటుకొన్నది.

1820 ఆగస్టులో బ్రౌన్ కడపలో ఉద్యోగజీవితం ప్రారంభించాడు. కడప కలెక్టరుకు అసిస్టెంటుగా వుండేవాడు. అప్పటి కలెక్టర్ హన్‌బరి తెలుగులో అనర్గళంగా మాట్లాడేవాడు. ఆయనలాగా మాట్లాడాలని నిశ్చయించుకున్నాడు బ్రౌన్.

1820-22 చివరి వరకు కడపలో పనిచేశాడు. కొంతకాలం మచిలీపట్నం, గుంటూరు, చిత్తూరు, తిరునల్వేలి మున్నగు చోట్ల పనిచేశాడు. 1826-29 మధ్య కడపలో మరోసారి ఉద్యోగం చేశాడు.

తెలుగు సాహిత్యానికి సుక్షేత్రమైన కడపలో ప్రధాన కార్యస్థానాన్ని నెలకొల్పాడు. ఆయన పలు చోట్ల పని చేసినా ఎక్కడా స్థిరాస్తి సంపాదించలేదు. కడపలో పెద్ద బంగళా, తోట కొన్నాడు. అప్పట్లో అతని వేతనం 5-6 వందలకు మించదు. బంగాళాలో పెద్ద గ్రంథాలయం నెలకొల్పాడు. సొంత డబ్బుతో పండితులను నియమించాడు. బంగళాను 'సాహిత్య కర్మాగారం'గా రూపొందించాడు.

అవిద్య అకాండతాండవం చేస్తున్న కాలమది. చదువుకొన్న తెలుగు యువకులు చాలా అరుదుగా వున్న కాలమది. 1821లో కడపలో రెండు బళ్ళు పెట్టాడు. ఉచితంగా తెలుగు, హిందూస్తానీలలో చదువు చెప్పించాడు. ఆ బళ్ళలో దేశీయ ఉపాధ్యాయులను నియమించాడు. విద్యార్థులకు ఉచిత భోజన సౌకర్యం కల్పించాడు.

కడపలోని బంగళా, తోట వ్యవహారాలన్నింటినీ బ్రౌన్‌కు అత్యంత విశ్వాస పాత్రుడైన అయోధ్యాపురం కృష్ణారెడ్డి చూచుకొనేవాడు. బ్రౌన్ ఎక్కడ పనిచేస్తున్నా కడపలోని బంగళా, తోట, గ్రంథ పరిష్కరణ, గ్రంథ సేకరణ మున్నగు విషయాలను అయోధ్యపురం కృష్ణారెడ్డి ద్వారా జాబుల మూలంగా తెలుసుకొనేవాడు.

మచిలీపట్నంలో కూడా రెండు పాఠశాలలను ప్రారంభించాడు. అక్కడ కూడా ఉచిత భోజన వసతి కల్పించాడు.

1824లో అబేదుబాయ్ వ్రాసిన "హిందూ మేనర్స్, కస్టమ్స్ అండ్ సెర్మనీస్"పుస్తకం చదువుతుండగా వేమన ప్రస్తావన కన్పించింది. వేమన పట్ల శ్రద్ధ పెరిగింది. వేమన పద్యాలు గల తాటాకు ప్రతులెన్నో తెప్పించాడు. మచిలీపట్నం కోర్టు పండితుడు తిప్పాభట్ల వెంకట శివశాస్త్రి. వఠ్యం అద్వైత బ్రహ్మశాస్త్రి ఆ దశలో సాహిత్య విద్యా గురువులయ్యారు. వేమన పద్యాలకు అర్థతాత్పర్యాలు బోధించారు. తెలుగు వ్యాకరణ, ఛందస్సూత్రాలు నేర్చుకొన్నాడు బ్రౌన్.

1825లో రాజమండ్రికి బదిలీ అయి ఆంధ్ర మహాభారతం చదవసాగాడు. అప్పకవీయం, కవిజనాశ్రయం మున్నగు వాటిని జీర్ణించుకున్నాడు. తెలుగు భాషా సాహిత్యాల అధ్యయనం ముమ్మరంగా సాగించాడు. అగ్గి పురుగులకు ఆహుతి కానున్న తెలుగు కావ్యాల వ్రాత ప్రతులను సేకరించాడు. కొంత డబ్బుతో పండితులను, వ్రాయసగాళ్ళను పెట్టి కావ్య పరిష్కరణ, శుద్ధప్రతులు తయారు చేయించాడు. ఆంధ్ర మహాభారతాన్ని, భాగవతాన్ని పరిష్కరింప చేసి అచ్చు వేయించినవాడు బ్రౌన్. 'నిలువ నీడ లేకుండా పోయిన తెలుగు సరస్వతిని ఆహ్వానించి, తన బంగళాలో ఒక సాహిత్య పర్ణశాల ఏర్పరచి, ఆ వాగ్దేవిని నిండు ముత్తైదువ లాగా నడయాడేటట్లు చేయగలిగాడు బ్రౌన్' అన్నాడు పరిశోధక సాహసి బంగోరె.

తెలుగుదేశాన్ని ముఖ్యంగా రాయలసీమను కృంగదీసిన కరువులెన్నో వచ్చాయి. వాటిలో ధాత కరువు (1876-77) అంతకుముందు వచ్చిన నందన కరువు(1832-33) మహాఘోరమైనవి. నందన కరువునే 'గుంటూరు కరువు'గా చరిత్రకారులు చిత్రించారు. కరువు పరిస్థితులను గురించి ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి వ్రాసిన జాబులోని పదజాలం ప్రభుత్వానికి నచ్చలేదు. కరువు(ఫ్యామిన్)అన్న పదానికి బదులుగా 'కొరత' అని వ్రాయమన్నారు. బ్రౌన్‌ను ప్రభుత్వం మందలించింది. కరువు కాలంలో గుంటూరు జిల్లాలో ఎన్నో గంజి కేంద్రాలు ఏర్పాటు చేయించి ప్రజలను ఆదుకొన్నాడు.

1835-38 మధ్య సెలవుపై లండన్ వెళ్ళాడు. అక్కడ కూడా విశ్రాంతి లేకుండా తెలుగు భాష కొరకు శ్రమించాడు. 'ఇండియ హౌస్ లైబ్రరి'లో గుట్టలుగా పడివుండిన దక్షిణ భారత భాషల గ్రంథాలు (లిఖిత ప్రతులు) 2106ను మద్రాసు గ్రంథాలయానికి పంపాడు. తిరిగి వచ్చిన తర్వాత వసుచరిత్ర- మనుచరిత్రలకు వ్యాఖ్యలు వ్రాయించాడు. కళాపూర్ణోదయం, పల్నాటి వీర చరిత్ర మున్నగు 25 ప్రబంధాలను పరిష్కరింపజేశాడు. సంస్కృత గ్రంథాల సేకరణ, పరిష్కరణ చేశాడు.

దాదాపు 2 వేల వేమన పద్యాలను సేకరించి వాటిలో 693 పద్యాలను ఇంగ్లీషులోకి అనువాదం చేసి అచ్చు వేయించాడు. అలా వేమన పద్యాలకు ప్రపంచంలో విస్తృత ప్రచారం కాపించాడు.

ఇదంతా పండిత భాషకు సంబంధించిన కృషి. ప్రజా భాషకు మరింత ఎక్కువ కృషి చేశాడు.ప్రజల నోళ్ళలో నానుతూ వచ్చిన చాటువులను, సామెతలను, కథలు, గాథలు, పలుకుబడులను సేకరించాడు.తెలుగు నేర్చుకోదలచిన ఆంగ్లేయుల కోసం ఎన్నో వాచకాలు, వ్యాకరణ గ్రంథాలు వ్రాశాడు. అన్నిటి కన్నా మిన్నగా చెప్పవలసిన పని, నిఘంటు నిర్మాణం. తెనుగు-ఇంగ్లీషు, ఇంగ్లీష్ తెనుగు నిఘంటువులు వ్రాశాడు. ఈనాటికీ అవి ప్రామాణికంగా వున్నాయి. జిల్లా నిఘంటువు వ్రాశాడు. తెలుగు సాహిత్యం గురించి శిల్పము, జ్యోతిష్యము, కలిశకం, హిజరి మున్నగు వాటిపై పెక్కు వ్యాసాలు వ్రాశాడు. రాజుల యుద్ధము అను అనంతపురం చరిత్ర తాతాచారి కథలు, పంచతంత్ర కథలు యిలా ఎన్నో రచనలు చేశాడు.



బ్రౌన్‌కు ఆనాటి పండితులు, యితరులు వ్రాసిన జాబుల సంపుటాలు 20కి పైగా వున్నాయి. ఒక్కొక్క సంపుటంలో 400 పేజీలున్నాయి. ఇవన్నీ మద్రాసు ఓరియంటల్ మేనుస్క్రిప్టు లైబ్రరీలో వున్నాయి. వీటిలో విలువైన చారిత్రక విషయాలున్నాయి.

ప్రతి పైసాను కూడబెట్టి తన కింద పనిచేసే పండితులకు నెలనెలా జీతాలిచ్చే వాడు.ఆర్థికంగా కటకటలాడుతున్నా పుస్తకాల సేకరణ, ప్రచురణ పథకాలను నెలనెలా వందలు ఖర్చు చేసేవాడు. చివరికి 60వేల రూపాయలు అప్పులు చేశాడు. ఇందులో సగం వడ్డీ- ఇదంతా తెలుగు భాషోద్ధరణ కోసమే . చివరి దశలో అప్పులన్నీ తీర్చాడు.

బ్రౌన్ మానవతావాది. ప్రతి నెలా 100 - 130 మంది గుడ్డి, కుంటి వారికి సాయం చేసేవాడు. అప్పులు చేసి జైలుపాలైన పదుకొండు మందికి 355 రూపాయలిచ్చి విడిపించాడు. ఒక దశలో నెలకు సగటున రు.500 రూపాయలు దానధర్మాలకు ఖర్చు చేసేవాడు. కడపలో జరుగనున్న సహగమనాన్ని ఆపు చేయించాడు.

ఆంధ్ర సాహిత్యాన్ని ప్రజ్వలింపచేసిన బ్రౌన్ దొర సేవను ప్రశంసిస్తూ, నాటి పండితుడు. అద్వైత బ్రహ్మశాస్త్రి యిలా అన్నాడు.

"సరస్వతికి ప్రస్తుతమందు తమరు ఒకరే నివాసస్థానముగా కనబడుతున్నారు. ఎక్కడ ఏ ఏ విద్యలు దాచబడి వున్నవో అవి అన్నీ తమంతట తామే తమ సన్నిధికి వస్తూ వున్నవి ... తమరు పుచ్చుకొన్న ప్రయాసల వల్ల తేలిన పరిష్కారగ్రంథములు అకల్పాంతమున్ను తమ యొక్క కీర్తిని విస్తరిస్తూ వుంటవి."

ఆంధ్ర భాషోద్ధరణ కోసం జీవితం అంకితం చేసిన బ్రౌన్ స్మృతి చిహ్నంగా కడపలో ఆయన నివసించి సాహిత్య యజ్ఞం చేసిన స్థలంలో గ్రంథాలయ భవన నిర్మాణం పూర్తి అయింది. బ్రౌన్ బంగళా శిథిలాలున్న స్థలాన్ని శ్రీ సి. కె. సంపత్ కుమార్ సి.పి. బ్రౌన్ మెమోరియల్ ట్రస్టుకు ఉచితంగా యిచ్చారు. ప్రజా

విరాళంగా రు. 3-20 లక్షలు, ప్రభుత్వం నుండి రు.4-50 లక్షలు ఖర్చు చేసి విశాలమైన గ్రంథాలయ భవనం నిర్మింపబడింది. శ్రీ పోలేపల్లి వెంగన్న శ్రేష్టి తమ సొంత గ్రంథాలయంలోని మూడు వేల పుస్తకాలు. డా. పుట్టపర్తి వారు వంద విలువైన పుస్తకాలు యీ గ్రంథాలయానికి యిచ్చారు. ఈ గ్రంథాలయానికి యిచ్చే విరాళాలపై ఆదాయపు పన్ను రాయితీ యివ్వబడుతుంది. తి.తి.దేవస్థానం, తెలుగు అకాడమి, తెలుగు విశ్వవిద్యాలయం, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం, ఆచార్య చల్లారాధకృష్ణశర్మ డా॥ బెజవాడ గోపాలరెడ్డి, డా.కె. జగ్గయ్య మున్నగువారు పెక్కు గ్రంథాలను ఇచ్చారు. ఇప్పుడు ఈ గ్రంథాలయంలో 11 వేల గ్రంథాలున్నాయి.

తెలుగు భాషా సాహిత్యాల సముద్ధరణ కోసం నిర్విరామంగా కృషి చేసిన సి.పి. బ్రౌన్ 1854లో పదవీ విరమణ చేసి లండన్‌లో స్థిర పడ్డారు. లండన్ యూనివర్సిటీలో తెలుగు ప్రొఫెసర్ గా కొంతకాలం పనిచేసి 1884 డిసెంబర్ 12న ఎనభై ఏడవ ఏట కన్ను మూశాడు.

క॥ నూరార్లు లెక్క సేయక
పేర్లందిన విబుధ జనుల బిలిపించుచు వే
మార్లర్థ మిచ్చు వితరణి
చార్లెసు ఫిలిప్సు బ్రౌన్ సాహెబు కరుణన్
అని నివాళులందుకొన్నాడు.

ఆంధ్రప్రదేశ్ అవతరణకు మూలపురుషుడు

# అమరజీవి పొట్టి శ్రీరాములు



హరిజనోద్ధరణకు అందరూ పూనుకోవాలని రాసిన అట్టలను మెడకు తగిలించుకుని ప్రచారం చేశారు. మండుటెండల్లో చెప్పులు, గొడుగు లేకుండా జాతీయోద్యమాన్ని వాటి ప్రచారం చేసేవారు. ఆ దేశభక్తుణ్ణి సామాన్యులు "పిచ్చి శ్రీరాములు"అనేవారు. అవును దేశాభ్యుదయమనే పిచ్చి ఆయనకు పట్టింది.

పట్టుమని పదిమంది పొట్టి శ్రీరాములు వంటి మహావ్యక్తులు వుంటే, మన పవిత్ర భారతదేశానికి ఒక్క సంవత్సరం లోనే స్వాతంత్ర్యం తెచ్చి పెట్టగలను' అన్నారు గాంధీజీ.

దేశభాషల సమున్నతికి ఆత్మబలిదానం గావించిన త్యాగమూర్తి పొట్టి శ్రీరాములు. భాషా ప్రయుక్త రాష్ట్రాల అవతరణకు మూల పురుషుడాయన.

పొట్టి శ్రీరాములుగారి పూర్వీకులు నెల్లూరు జిల్లాలోని పడమటపల్లెకు చెందినవారు. ఆయన తండ్రి గురవయ్య. తల్లి మహాలక్ష్మమ్మ. శ్రీరాములు గారి బంధువుల కుటుంబాలు మద్రాసులో వున్నందున గురవయ్య గారు కూడా మద్రాసులోనే స్థిరపడ్డారు. శ్రీరాములుగారు మద్రాసు జార్జిటౌన్ అణ్ణాపిళ్ళై వీధిలోని 165 నంబరు ఇంటిలో 1901మార్చి 16వ తేదీన జన్మించారు.ఇరవై ఏళ్ళవరకు శ్రీరాములు గారి విద్యాభ్యాసం మద్రాసులోనే జరిగింది. బొంబాయిలో శానిటరీ ఇంజనీరింగ్ చదువు పూర్తి చేశారు.

త్వరలోనే గ్రేట్ ఇండియన్ పెనిన్సులా రైల్వేలో నెలకు రు.250/- జీతంగల ఉద్యోగంలో చేరారు. పాతికేళ్ళ ప్రాయంలోనే ఆయన భార్య గతించింది. ఆ కారణంగా ఐహిక సుఖాలపట్ల ఆయనకు విరక్తి కలిగింది. తన జీవితాన్ని దేశానికి అంకితం చేయాలని నిశ్చయించారు.

గాంధీజీ సబర్మతీ ఆశ్రమం నుండి జాతీయోద్యమ శంఖారావం పూరించారు. బాపూజీ పిలుపు విన్న పొట్టి శ్రీరాములు 1927లో తన ఉద్యోగానికి రాజీనామా యిచ్చారు. తన ఆస్తిపాస్తులను తల్లికి అన్నదమ్ములకు పంచి పెట్టారు. సబర్మతీ ఆశ్రమం చేరారు. గాంధీజీ శిష్యులుగా నిర్మాణ కార్యక్రమాల్లో పాల్గొనసాగారు. మూడు సార్లు రాజకీయ నిర్బంధితులుగా కారాగర వాసంచేశారు. సత్యాగ్రహం, శాసనోల్లంఘనం వంటి ఉద్యమాల్లో అగ్రగామిగా వుంటూ గాంధీజీ ప్రశంసలందుకున్నారు. గుజరాత్ రాష్ట్రంలోను, వివిధ ప్రాంతాల్లోనూ, మన రాష్ట్ర మందలి కొమరవోలులోను నిర్మాణ కార్యక్రమాల్లో పాల్గొని గొప్ప సేవచేశారు. 1941-1942 సంవత్సరాల సత్యాగ్రహం, 'క్విట్ ఇండియా' ఉద్యమాల్లో పాల్గొని జైలు శిక్ష అనుభవించారు.1944 లో నెల్లూరు కార్య క్షేత్రంగా ఖద్దరు ఉత్పత్తి, వ్యాప్తి కార్యక్రమాల్లో తీవ్రంగా కృషి చేశారు.

1946లో నెల్లూరు మూలపేటలోని వేణుగోపాలస్వామి ఆలయంలో హరిజనుల ప్రవేశంకోసం నిరాహారదీక్ష ప్రారంభించారు. ఆయన దీక్ష ఫలితంగా హరిజనులు ఆలయంలో ప్రవేశింపగలిగారు. ఆ సంవత్సరంలోనే మద్రాసు ప్రభుత్వంచే హరిజనుల ఆలయప్రవేశం, హరిజనోద్ధరణకు సంబంధించిన రెండు శాసనాలను ఆమోదింప చేసేందుకు 23 రోజుల నిరశన దీక్ష చేశారు. ఆయన వజ్ర సంకల్పం ఫలించింది. మూడో మారు వార్ధాలో 1948లో నిరాహార దీక్ష 29రోజులు సాగించారు.

ఆయన పదవులకోసం, కీర్తి ప్రతిష్ఠలకోసం ఏనాడూ పోరాడలేదు. గాంధీజీ బోధించిన సత్యాహింసలు, హరిజనోద్ధరణ ఆయన జీవితాశయాలు. మిత్రుల వత్తిడిని కాదనలేక కొంత కాలం ఆంధ్రరాష్ట్ర గాంధీ స్మారక సంఘ కార్యదర్శిగా పనిచేశారు.

శ్రీరాములుగారు జీవితపు చివరి దశలో నెల్లూరులో వుంటూ హరిజనోద్ధరణకు నిర్విరామంగా పనిచేశారు. హరిజనోద్ధరణకు అందరూ పూనుకోవాలని వ్రాసిన అట్టలను మెడకు, వీపుకు తగిలించుకుని ప్రచారం చేసేవారు. త్యాగమే ధనంగా పెరిగిన ఆయన ముతక ఖద్దరు దుస్తులు ధరించి, నెల్లూరు పట్టణ వీధుల్లో దయగలవారు పెట్టిన ఆహారంతో బ్రతికారు. కాళ్ళకు చెప్పులుగాని, తలపైగొడుగుగాని లేకుండా మండుటెండల్లో తిరుగుతూ జాతీయ ఉద్యమ ప్రచారం చేసేవారు.ఆ దేశభక్తుణ్ణి సామాన్యులు"పిచ్చి శ్రీరాములు" అనేవారు. అవును దేశాభ్యుదయమనే పిచ్చి ఆయనకు పట్టింది.

మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం ఆంధ్ర ప్రాంతం పట్ల ప్రదర్శిస్తున్న సవతి తల్లి దృష్టిని ఆయన గమనించారు. మద్రాసు నగరంపై ఆంధ్రులకు హక్కు వున్నదని, ప్రత్యేక

ఆంధ్రరాష్ట్రం వల్లనే ఆంధ్రులు బాగుపడగలరని ఆయన భావించారు. 1952 అక్టోబరు 19వ తేదీన మద్రాసులోని మైలాపూర్‌లో బులుసు సాంబమూర్తిగారి బసలో 4వ సారి నిరాహారదీక్షకు పూనుకున్నారు. ఆ దీక్ష అవిచ్ఛిన్నంగా సాగింది. ప్రభుత్వం నిమ్మకు నీరెత్తినట్లుండి పోయింది. ప్రజల్లో ఆందోళన పెరిగింది. తనకు స్పృహ తప్పిన పక్షంలో తన వ్రతానికి భంగం కలిగించే విధంగా ఎట్టి పని చేయరాదని ఆయన శాసించారు. ఆంధ్రనాయకులు దేశాధినేతలకు విన్నపాలు పంపారు. కేంద్రప్రభుత్వం చూస్తూ వుండిపోయింది. చివరకు ఆ దధీచి 1952 డిసెంబర్ 15వ తేదీన ప్రాణత్యాగం చేశారు.

శ్రీరాములుగారి మరణవార్త మెరుపుతీగలా దేశమంతటా వ్యాపించింది. ఆంధ్రుల సహనం హద్దులు దాటి విశృంఖలంగా దౌర్జన్యానికి దారి తీసింది. కేంద్ర ప్రభుత్వం ప్రజా ప్రభంజనానికి ఎదురు నిలువలేక ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర స్థాపనకు అంగీకరించింది.

1953 అక్టోబర్ 1వ తేదీన కర్నూలు రాజధానిగ ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది.

'ఆంధ్రరాష్ట్రము వచ్చె
మహాంధ్రరాష్ట్ర మేరుపడువేళ
పొలిమేర చేర పిలిచె'అని దాశరథి
ప్రజలనుత్తేజపరిచారు. ఆంధ్రుల అంతిమ లక్ష్యమైన ఆంధ్రప్రదేశ్ 1956 నవంబర్ ఒకటవ తేదీన హైదరాబాద్ రాజధానిగా అవతరించింది.

మైలాపూర్ రాయపేట హైరోడ్‌లోని 126 నంబర్‌న పొట్టి శ్రీరాములుగారు కన్ను మూసిన ఇంటిని ఆ త్యాగమూర్తి స్మృతిచిహ్నంగా మన రాష్ట్ర ప్రభుత్వం కాపాడుతూ వున్నది. ఆస్మృతి మందిరాన్ని పవిత్ర సాంస్కృతిక క్షేత్రంగా పెంపొందించటం తెలుగు ప్రభుత్వం మొదటి కర్తవ్యం.

తొలి తెలుగు రాజకీయ ఖైదీ

# గాడిచర్ల హరిసర్వోత్తమరావు

"వందేమాతరమనగనే వచ్చితీరు ఎవని పేరు?
వయోజన విద్య అనగనే వచ్చి తీరు ఎవరి పేరు?
గ్రామగ్రామమున వెలసెడి గ్రంథాలయ మెవనికి గుడి?
అరగని తరగని వొడవని అక్షర దానం బెవనిది?
అరువదేండ్లు ప్రజలకొరకు అరిగిన కాయంబెవనిది?
తన బరువును మోయలేని తనువును చాలించెనెవడు?
తరతరాలు ఎవని మేలు తరలుచు పొరలుచు నుండును?
అందరికెవనితొ పొత్తు – అఖిలాంధ్రంబెవని సొత్తు
ఏస్థాన కవిని నేనో, ఆస్థానాధీశుడెవడు?
వయోవృద్ధుడగు యువకుడు వాస్తవ జీవిత మతనిది
హరిసర్వోత్తముడాతడు ఆంధ్రుల పాలిటి దేవుడు "

– కాళోజి నారాయణరావు

ఆంధ్ర దేశంలో స్వాతంత్ర్యోద్యమ వైతాళికులుగా, ప్రప్రథమ ఆంధ్ర రాజకీయ ఖైదీగా నిస్వార్థ, నిరాడంబర ప్రజాసేవకులుగా విద్యావేత్తగా, త్యాగమూర్తిగా విఖ్యాతులైన దేశభక్తులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు.

లోకమాన్య బాలగంగాధర తిలక్, బిపిన్ చంద్రపాల్ గార్లచే ప్రభావితులైన శ్రీ గాడిచెర్ల విద్యార్థిదశలోనే స్వరాజ్యోద్యమంలో సమరోత్సాహంతో పాల్గొని యువతనుత్తేజ పరచిన దేశభక్తులు.

ఆయన జననం 14-9-1883. వారి పూర్వీకులు కడపజిల్లా సింహాద్రిపురం గ్రామానికి చెందినవారు. శ్రీ రావుగారు పుట్టింది కర్నూలులో. కర్నూలు, గుత్తి, నంద్యాలలో ఉన్నత పాఠశాల విద్య పూర్తిచేసి, మద్రాసు క్రైస్తవ కళాశాలలో విద్యార్థి వేతనం పొంది 1906లో ఎం.ఏ. డిగ్రీ సంపాదించారు. ఉపాధ్యాయ శిక్షణ నిమిత్తం 1907 లో రాజమండ్రిలోని టీచర్స్ ట్రైనింగ్ కాలేజీలో ఎల్.టి. చదువుతుండగా స్వరాజ్యోద్యమంలో దూకారు.

## ప్రభుత్వ ఆంక్ష

భారత స్వాతంత్ర్యోద్యమ త్రిమూర్తుల(లాల్, బాల్, పాల్)లో ఒకరైన బిపిన్ చంద్రపాల్, రాజమండ్రి వచ్చి అక్కడ చేసిన ఉపన్యాసప్రభావం కాలేజి విద్యార్థులపై పడింది. విద్యార్థులు 'వందేమాతరం'బ్యాడ్జిలతో క్లాసుకు వెళ్ళారు. ప్రిన్సిపల్ మార్క్

హంటర్ బిళ్ళలు తీసివేస్తేకాని క్లాసులకు రానివ్వనని విద్యార్థులకు ఆదేశాలు పంపారు. అందుకు విద్యార్థులు తిరస్కరించారు. విద్యార్థి నాయకుడైన శ్రీ సర్వోత్తమరావును కాలేజీ నుండి డిస్మిస్ చేశాడు ప్రిన్సిపల్. ఆయన కెక్కడా ఉద్యోగమివ్వరాదని ప్రభుత్వం ఉత్తర్వుఇచ్చింది. రావుగారి జీవితంలో ఇదో పెద్ద మలుపు.

## స్వరాజ్య పత్రిక

జాతీయోద్యమ ప్రచారానికి పత్రికలు ప్రధాన సాధనాలని విశ్వసించి శ్రీరావు 1908 లో శ్రీ బోడి నారాయణ రావు (ప్రచురణ కర్త)సహకారంతో "స్వరాజ్య"తెలుగు వారపత్రికను ప్రారంభించారు. తెల్లదొరల అక్రమ, అన్యాయ చర్యలను తీవ్రంగా విమర్శిస్తూ రావుగారు వ్యాసాలు వ్రాసేవారు.

## కారాగార శిక్ష

1908లో తిరునల్వేలిలో ఆష్ అనే ఆంగ్లేయ అధికారిని విప్లవ కారులు కాల్చి చంపారు. ప్రజోద్యమాన్ని అణచివేసేందుకు పోలీసులు జరిపిన కాల్పుల్లో ముగ్గురు అమాయకులు ప్రాణాలు కోల్పోయారు. రావుగారు 'విపరీత బుద్ధి' అన్న శీర్షికతో సంపాదకీయం వ్రాస్తూ అధికారుల దమన కాండను తీవ్రంగా ఖండించారు. రావుగారికి, రాజద్రోహ నేరంపై మూడేళ్ళ కఠిన కారాగార శిక్ష విధించింది ప్రభుత్వం. నాటి జైలు జీవితానుభవాలను శ్రీ దర్శి చెంచయ్య "నేనూ - నా దేశం" అన్న గ్రంథంలో ఇలా చిత్రించారు.

"ఎం.ఏ. పట్టభద్రులైన శ్రీసర్వోత్తమరావును వెల్లూరు సెంట్రల్ జైలులో బంది పోటు దొంగలు, హంతకులున్న గదిలో వేశారు. మానసంరక్షణకు రెండు గోచిలిచ్చారు. మూరెడు చదరంగల రెండు తువ్వాళ్ళు. పడుకునేందుకు చిన్న ఈత చాప, అన్నం తినడానికి మట్టి చట్టి, నీళ్ళు త్రాగడానికి మట్టి ముంత, మల మూత్ర విసర్జనకు మరొక మట్టి చట్టి ఇచ్చారు. కాలికి లావాటి కడియం, మెడకు మరొక కడియం వేసి ఒక కొయ్య ముక్కను వీటిలో దూర్చారు. మొలత్రాడు, జందెం తీసివేశారు. తల బోడి చేయించారు.... రాగి సంకటి ముద్ద, దానిలో రాళ్ళు, పుల్లలు, పురుగులు తేలుతుండేవి. ఈ తిండిలో మూడేళ్ళు జీవించారు.... గవర్నర్ జైలును చూచుటకు వచ్చినప్పుడు, తనను మానవమాత్రునిగా చూడమని కోరగా, ఆ దుర్మార్గుడు రావుగారిని దుర్భాషలాడి వెళ్ళిపోయాడు."ఈ విధంగా అష్టకష్టాలను స్థిర చిత్తంతో ఎదుర్కొన్న స్వాతంత్ర్య సమర యోధులు శ్రీ గాడిచర్ల.

1914లో తిలక్, అనీబిసెంట్ గార్లు స్థాపించిన 'హోమ్‌రూల్ లీగ్' ఆంధ్ర శాఖకు కార్యదర్శిగా వుండి, రాష్ట్రమంతటా పర్యటించి తమ అనర్గళ ప్రసంగాలతో ప్రజలను వుత్తేజితుల గావించారు.

## స్వరాజ్య పార్టీలో చేరిక

1923లో చిత్తరంజన్ దాస్, మోతీలాల్ నెహ్రూ గార్లు నెలకొల్పిన స్వరాజ్య

పార్టీలో చేరారు రావుగారు. 1924 జనవరి 1,2తేదీలలో కాకినాడలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ మహాసభల్లో, స్వయం సేవకుల సంస్థ "హిందూస్థానీ సేవాదళ్" స్థాపనలో శ్రీరావు ప్రముఖ పాత్ర వహించారు.

1927లో రావుగారు, ఆంధ్ర కాంగ్రెస్ అభ్యర్థిగా నంద్యాల నియోజక వర్గం నుండి మద్రాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు జరిగిన ఎన్నికలో జస్టిస్ పార్టీ అభ్యర్థిని ఓడించి ఎన్నుకోబడ్డారు. ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేట్ మెంబరుగా పనిచేశారు.

కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారు ప్రారంభించిన విజ్ఞాన చంద్రిక గ్రంథ మండలి కార్యదర్శిగా, ఆ సంస్థ నుండి వెలువడిన మొదటి గ్రంథం, 'అబ్రహాం లింకన్'జీవిత చరిత్ర వ్రాశారు.గ్రీస్ దేశ చరిత్ర, విస్మృత కవిసార్వభౌముడు మున్నగు గ్రంథాల నెన్నింటినో వ్రాశారు. 'శ్రీ రామ చరిత్ర'కు వ్యాఖ్య వ్రాశారు. రాజకీయ, ఆర్థిక, సామాజిక సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొంటూ వందలాది వ్యాసాలు రచించారు. విద్యార్థి దశలోనే రాజమండ్రిలో 100 మందితో వయోజన విద్యాకేంద్రం నడిపారు. రైతు సంక్షేమానికి పాటు పడ్డారు. పంచాయితీ మహాసభ, సహకార సభ, హిందీ మహాసభ, ఉపాధ్యాయ మహాసభ వంటి ఎన్నో సభలకు అధ్యక్షత వహించారు. మద్రాసులో పాకీ పని వార్ల సంఘానికీ, ప్రెస్ వర్కర్ల సంఘానికి అధ్యక్షులుగా వుండేవారు. 1930 లో రాజకీయ రంగం నుండి క్రమముగా వైదొలగి, గ్రంథాలయోద్యమం, వయోజనవిద్యా రంగాల్లో జీవితమంతా గడిపారు. 1934 నుండి జీవితాంతం దాక ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ అధ్యక్షులుగా ఉండేవారు. గ్రంథాలయ కార్యకర్తలకు, వయోజన విద్యా బోధకులకు ఉపయుక్తమగు రచనలెన్నో చేశారు. ఎన్నో శిక్షణా శిబిరాలను నిర్వహించారు. భారత వయోజన విద్యాసంఘంలోను, అంతర్జాతీయ వయోజన విద్యా మహాసభలోను ప్రముఖ పాత్ర వహించారు.

ఆంధ్రరాష్ట్ర స్థాపనకు అవిశ్రాంతంగా కృషిచేసి, ఆంధ్ర ప్రజలందరినీ సమైక్య పరచి ఆంధ్రప్రదేశ్ అవతరణను చూచారు.

1950లో మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం రావుగారిని, ఆంధ్ర ప్రాంత వయోజన విద్యా గౌరవ డైరక్టర్‌గా నియమించింది. 1952లో గాడిచర్లవారు బళ్ళారి జిల్లాలోని (అవిభక్త మద్రాసు రాష్ట్రం)కన్నడ తాలూకాలలో పర్యటించినప్పుడు, వారి తెలుగు ప్రసంగాలను కన్నడం చేసే అదృష్టం నాకు కల్గింది. పగటి పూట గ్రామ పంచాయి తీలను, గ్రంథాలయాలను దర్శించేవారు. రాత్రివేళల్లో వయోజన విద్యా కేంద్రాలను దర్శించేవారు. వారి అవిశ్రాంత కృషి ఆదర్శ వంతం.

## కళలకు ప్రోత్సాహం

సామాన్య ప్రజలలో కళల పట్ల, సాహిత్యం పట్ల అభిరుచి పెంచేందుకు నాట కోత్సవాలను జరిపారు. కృష్ణదేవరాయ జయంత్యుత్సవాలను జరిపారు. 1928లో నంద్యాలలో శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్ అధ్యక్షతన జరిగిన ఆంధ్ర మహాసభలో, దత్త మండలాన్ని 'రాయలసీమ'గా నామకరణం చేసినవారు శ్రీ గాడిచర్ల వారే!

శ్రీరావు ఆంధ్ర పత్రిక సంపాదకులుగా కొంతకాలం పనిచేశారు. తాడిపత్రిలో "మాతృసేవ" పత్రిక స్థాపనకు సంకటి కొండారెడ్డిగారిని ప్రోత్సహించారు. శైవ సుబ్రహ్మణ్య శర్మ(నంద్యాల)గారితో పాటు "కౌమోదకి" పత్రిక స్థాపించారు. అయుర్వేద వైద్య ప్రచారం చేశారు.

బీద కుటుంబంలో పుట్టిన రావుగారు ఏనాడూ, ఏ పదవికీ ప్రాకులాడలేదు. 'హిందూ 'పత్రికకు సమీక్షలెన్నో వ్రాశారు. ఆ విధంగా తమకు కావలసిన పైకాన్ని సమ కూర్చుకునేవారు. ఎవరినీ యాచించని ఆత్మ ధనులాయన.

## గాంధీజీ ప్రశంస

తాము నమ్మిన సిద్ధాంతాల పట్ల అచంచల విశ్వాసం గలవారు, గాంధీజీనే విమర్శించి నపుడు, 'దబ్రేవ్ హరిసర్వోత్తమరావు' అన్నారు గాంధీజి.

వృద్ధాప్యంపైబడినా, తమ పనులను తామే చేసుకునే వారు. అనంతపురంలోని వయోజన విద్యాకేంద్రాన్ని దర్శించేందుకు వచ్చినపుడు (1956లో)వారు వేకువనే లేచి వాహ్యాళి వెళ్ళారు. అదివరకే వారితో నాకున్న పరిచయంతో, వారి పడకను దులిపి చుట్టి పెట్టాను. వచ్చిన వెంటనే నన్ను పిలిచి "నా పడక ఎందుకు చుట్టావ్. నాపని నేనే చేసుకోవాలి. నన్ను త్వరగా చావ మంటారా? "అన్నారు. క్షమించమన్నాను.

నిరంతర శ్రమ వల్ల వారి ఆరోగ్యం దెబ్బతినింది. మద్రాస్‌లోని గోపాలపురంలో వున్న కూతురు, శ్రీమతి ద్వారకాబాయి, అల్లుడు పార్థసారథి గార్లతో వుండి పోయారు. రావు గారి వైద్య సేవల కోసం చివరి దశలో శ్రీగోవింద వల్లభపంత్ 2 వేల రూపాయలు పంపారు. అంతే వారందుకున్న ప్రతిఫలం.

గాడిచర్ల వారి సేవలకు చిహ్నంగా విజయవాడలో (పటమట)సర్వోత్తమ భవనం నిర్మింపబడినది. కీ॥శే॥పాతూరి నాగభూషణం గారు ఈ స్మారక భవన నిర్మాణాని కెంతో కృషి చేశారు.

త్యాగం, సేవ, దీక్ష మున్నగు గుణాలకు మూర్తిగా వెలిగిన 'ఆంధ్ర తిలక్' శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు 1960 ఫిబ్రవరి 29న మద్రాస్‌లో కన్ను మూశారు.

"నిజానికి ఆనాడు ఆంధ్రలో హరిసర్వోత్తమరావు జన్మించి వుండని యెడల రాజకీయోద్యమానికి పునాదియేలేకపోయివుండేది. ఆంధ్రలో రాజకీయాలకు ఆది పురుషుడు శ్రీ హరిసర్వోత్తమరావు" అన్న యఱ్ఱ మిల్లి జగ్గన్న శాస్త్రి గారి పలుకులు అక్షరాలా నిజమైనవి.

“భారతరత్న” అవార్డు పొందిన భారత రాజ్యాంగశిల్పి

# డా॥ భీమ్‌రావ్ అంబేద్కర్



భారత రాజ్యాంగ శిల్పిగా, ప్రజాస్వామ్య పరిరక్షకునిగా, సంఘసంస్కర్తగా, మహా మేధావిగా విఖ్యాతుడైన డాక్టర్ భీమ్‌రావ్ అంబేద్కర్ స్మృతికి నివాళులర్పిస్తూ, ఆ మహనీయునికి ‘భారతరత్న’అవార్డును భారత ప్రభుత్వం యివ్వడం అత్యంత అభినందనీయం.

బాల్యంలోనే అడుగడుగునా బాధలకు, అవమానాలకు గురియై, బీదరికాన్ని ఎదుర్కొంటూ స్వయంకృషితో, స్వీయప్రతిభతో స్వతంత్ర భారతదేశంలో కేంద్రమంత్రి పదవిని అలంకరించిన మహామనీషి శ్రీ బాబాసాహెబ్ అంబేద్కర్.

లోకమాన్య బాలగంగాధరతిలక్, మహర్షి కార్వేవంటి అగ్రనాయకులు జన్మించిన మహారాష్ట్రంలోని రత్నగిరి జిల్లాలో, మందన్‌గాడ్ పట్టణానికి దగ్గరున్న అంబావాడే గ్రామంలో మెహర్ కులానికి చెందిన, రాంజీ సక్‌పాల్, భీమాబాయి దంపతుల 14వ సంతానంగా జన్మించిన వాడు అంబేద్కర్. జననం 1891 ఏప్రిల్ 14న. భీమ్‌రావ్‌ను తండ్రి చాలా క్రమశిక్షణతో పెంచాడు. బాల భీమ్‌రావ్ ప్రతిదినం రామాయణ, భారత, తుకారం, మోరోపంత్‌ల భజన గీతాలు గానం చేసేవారు. ఆ కుటుంబం శాకాహారం మాత్రమే సేవించేది.

మెహర్లను అస్పృశ్యులుగా పరిగణించిన కాలమది. వేసవిసెలవుల్లో మామగారున్న

గోరెగావ్‌కు భీమ్‌రావ్, అన్న, మేనల్లుళ్ళతో పాటు వెళ్ళాడు. అనుకున్నట్లు, మామ స్టేషన్‌కు రాలేకపోయారు. స్టేషన్ నుండి, గ్రామానికి వెళ్ళటానికి బండిని కుదుర్చుకున్నాడు. కొంత దూరం వెళ్ళిన తర్వాత బండివాడికి, వీళ్ళు మెహర్ కులస్థులని తెలిసింది. అందరినీ బండి నుండి దిగమన్నాడు. ఎండాకాలం. పిల్లలు ఆ బండివాణ్ణే బతిమాలు కొన్నారు. రెండింతలు బాడుగ ఇస్తామన్నారు. భీమ్‌రావ్ అన్న బండి తోలేటట్లు, బండివాడు నడచి వచ్చేటట్లు మాట్లాడుకున్నారు. ఆకలి దప్పులతో అలమటిస్తూ అర్ధరాత్రికి గోరేగావ్ చేరారు పిల్లలు. వీధికుళాయి నీరుతాగుతూ వున్న భీమ్‌రావ్ ను కొట్టి, మంచినీరు త్రాగకుండా గెంటివేశారు. కులంపేర భీమ్‌రావ్ ను అవమానాలకు గురిచేశారు.

రామ్‌జీ, సతారా వదలి పిల్లల చదువుకోసం బొంబాయి చేరాడు. భీమ్‌రావ్ ఎల్‌ఫిన్‌స్టన్ హైస్కూల్‌లో చేరి మెట్రిక్యులేషన్ పాసయ్యాడు. సంస్కృతం చదువుకోవాలని ఆశించాడు. కులం అడ్డువచ్చింది. ఇష్టంలేకున్నా పర్షియన్ భాష చదివాడు. 16వ ఏటనే పెద్దలు అతనికి పెళ్ళి చేశారు. బరోడా మహారాజు శాయాజీరావ్ గైక్వాడ్ ఇచ్చిన 25 రూపాయల విద్యార్థి వేతనంతో 1912లో బి.ఏ. పరీక్షలో నెగ్గాడు.

పట్టభద్రుడైన వెంటనే బరోడా సంస్థానంలో ఉద్యోగం లభించింది. కాని పై చదువులు చదవాలన్న పట్టుదలవల్ల ఉద్యోగంలో చేరలేదు. మహారాజుకు తన కోరికను తెలిపాడు. విదేశంలో చదువుపూర్తిచేసిన తరువాత బరోడా సంస్థానంలో పదేళ్ళు పనిచేసే షరతుపై 1913లో రాజాగారి ఆర్థిక సహాయం అందుకొని కొలంబియా విశ్వ విద్యాలయం చేరాడు. 1915లో ఎం.ఏ.1916లో పిహెచ్.డి.డిగ్రీలను సంపాదించాడు. ఆనాటి సిద్ధాంత వ్యాసమే పదేళ్ళ తర్వాత "ది ఎవల్యూషన్ ఆఫ్ ప్రావిన్షియల్ ఫైనాన్సస్ ఇన్ ఇండియా"అను పేరుతో ప్రచురింపబడినది.1917 లో డాక్టర్ అంబేద్కర్‌గా స్వదేశం వచ్చాడు. అప్పటికాతని వయస్సు 27 ఏళ్ళు. అస్పృశ్యుడొకడు అంతగొప్ప పేరు సంపాదించుకోవటం ఆనాటి అగ్రవర్ణాలవారికి ఆశ్చర్యం కల్గించింది. మహారాజాగారి మిలిటరీ కార్యదర్శి అయ్యాడు. కాని ఆఫీసులో నౌకర్లు కాగితాలు ఆయన బల్లపై ఎత్తివేసేవారు!

కొల్హాపూర్ మహారాజు సాహూ మహరాజ్ అస్పృశ్యతా నివారణకెంతో కృషి చేస్తూండేవాడు. మహారాజా సహాయంతో అంబేద్కర్ 'మూక నాయక్'అనే పకపత్రిక సంపాదకత్వం వహించాడు.

32 సంవత్సరాల వయసులో డా. అంబేద్కర్ బార్-ఆట్-లా, కొలంబియా విశ్వవిద్యాలయం నుండి పిహెచ్.డి.లండన్ విశ్వవిద్యాలయం నుండి డి.ఎస్.సి. పట్టాలను పొందాడు. కాని ఆఫీసు జవానులు కూడా ఈయనను అస్పృశ్యుడుగా చూచారు.

1927లో మహద్‌లో దళిత జాతుల మహాసభ జరిగింది. మహారాష్ట్ర, గుజరాత్‌ల నుండి కొన్ని వేలమంది వచ్చారు. మహద్ చెరువులోని నీటిని త్రాగుటకు వీలు లేకుండినది: అంటరానివారికి ఆ చెరువులో ప్రవేశం లేకుండినది. అంబేద్కర్ -

కత్వంలో వేలాదిమంది చెరువు నీరు స్వీకరించారు. ఈ సంఘటన మహారాష్ట్రంలో సంచలనం కలిగించింది.

1927లో అంబేద్కర్'బహిష్కృత భారతి'అనే మరాఠి పక్ష పత్రిక ప్రారంభించాడు. ఆ పత్రికలో ఒక వ్యాసం వ్రాస్తూ అంబేద్కర్ ఇలా అన్నాడు: తిలక్ గనుక అంటరానివాడుగ పుట్టివుంటే'స్వరాజ్యం నా జన్మ హక్కు'అని ఉండడు. 'అస్పృశ్యతా నివారణే నా ధ్యేయం, నా జన్మ హక్కు'అని ప్రకటించి ఉండేవాడని వ్రాశాడు. అంటే ఆనాడు అంబేద్కర్ కులతత్వవాదుల బాధను ఎంతగా అనుభవించాడో తెలుస్తుంది.

1927లో ఛత్రపతి శివాజీ త్రిశతి జయంతి ఉత్సవాలు మహారాష్ట్ర అంతటా గొప్పగా జరిగాయి. అంబేద్కర్ ను సాదరంగా ఆహ్వానించాడు. కొలాబాలోని ఉత్సవ సంఘాధ్యక్షుడైన బ్రాహ్మణుడైన పలాయ శాస్త్రి. ఆ ఉత్సవాలలో ప్రసంగిస్తూ అంబేద్కర్ పీష్వాల సామ్రాజ్య పతనానికి ముఖ్యకారణం అస్పృశ్యతను పాటించడమే అన్నాడు.

1927 డిసెంబర్ 25న అంబేద్కర్ 'మనుస్మృతి'ని బహిరంగంగా కాల్చటం మరో సంచలనం కల్గించింది. ఆ విషయంగా మాట్లాడుతూ సవర్ణ హిందువుల దృష్టిని బలవంతాన ఆకర్షించడానికి అప్పుడప్పుడు అలాంటి తీవ్రచర్యలు అవసరమవుతాయన్నాడు. అంతేకాదు, మనుస్మృతి లోని అన్ని భాగాలు నిందనీయాలు కావు అన్నాడు.

1931 లో రెండవ రౌండ్ టేబిల్ సమావేశ సన్నాహాల సందర్భంగా అంబేద్కర్ గాంధీజీని కలుసుకున్నాడు. "ఏ దేశంలో లేదా ఏ మతంలో తమను కుక్కలకన్నా, పిల్లుల కన్నా హీనంగా చూస్తున్నారో ఆదేశాన్ని గురించి తానే విధంగాను భావించలేను అంటూ గాంధీజీ, 'ఐ హేవ్ నో హోమ్‌ల్యాండ్' అని చాటి చెప్పాడు. ఆ తర్వాత రౌండు టేబుల్ సమావేశాలకు లండన్ వెళ్ళాడు.

1932లో బ్రిటిష్ ప్రభుత్వం కమ్యూనల్ అవార్డును ప్రకటించింది. దాని ప్రకారం అస్పృశ్యులకు ప్రత్యేక స్థానాలు లభించాయి. ఎరవాడ జైలులో వున్న గాంధీజీ నిరాహారదీక్ష ప్రారంభించాడు. "మహాత్ములు వస్తుంటారు. పోతుంటారు. అంటరానివారు మాత్రం అంటరాని వారుగానే వుంటున్నారు." అన్నాడు అంబేద్కర్.

కొన్ని సంవత్సరాలు అస్పృశ్యతా నివారణ కోసం దళిత జాతుల హక్కుల కోసం పోరాటం సాగించాడు. భారతదేశానికి స్వాతంత్ర్యం రావటం, రాజ్యాంగ పరిషత్తు సభ్యుడుగ అంబేద్కర్ విశేష శ్రమవహించి రాజ్యాంగం రచించటం ఆయన శేష జీవితంలో ప్రముఖమైన ఘట్టం.

టి.టి. కృష్ణమాచారి (కేంద్రమంత్రి) ఒకమారు రాజ్యాంగ పరిషత్తులో మాట్లాడుతూ 'రాజ్యాంగ రచనా సంఘంలో నియమింపబడిన ఏడుగురిలో ఒకరు రాజీనామా చేశారు. మరొకరు మరణించారు. వేరొకరు అమెరికాలో వుండి పోయారు. ఇంకొకరు రాష్ట్ర రాజకీయాలలో నిమగ్నులయ్యారు. ఉన్న ఒక్కరిద్దరూ ఢిల్లీకి దూరంగా ఉన్నారు. అందువల్ల భారత రాజ్యాంగ రచనా భారమంతా డా. అంబేద్కర్ మోయవలసి వచ్చింది. రాజ్యాంగ రచన అత్యంత ప్రామాణికంగా వుంటుందనటంలో

ఏలాంటి సందేహం లేదు, అన్నాడు.

అంబేద్కర్ తన 56వ ఏట సారస్వత బ్రాహ్మణ కుటుంబానికి చెందిన కుమారి శారదా కబీర్‌ను పెళ్ళి చేసుకున్నాడు. మొదటి భార్య 1935 లో మరణించింది.

కేంద్ర మంత్రి మండలిలో న్యాయశాఖ మంత్రిగా వుండి 1951 అక్టోబర్ లో మంత్రి పదవికి రాజీనామా చేశాడు.

1956అక్టోబర్ 14న నాగ్‌పూర్‌లో అంబేద్కర్ బౌద్ధమతాన్ని స్వీకరించాడు. గాంధీజీతో అనేక విషయాలలో భేదించినా తాను మతం మారదలచుకున్నప్పుడు మాత్రం దేశానికి చాలా తక్కువ ప్రమాదకరం అయినదానినే ఎన్నుకుంటానని, బౌద్ధం భారతీయ సంస్కృతిలో భాగమని, ఈ దేశ చరిత్ర సంస్కృతులు,తన మార్పిడివల్ల దెబ్బతినకుండా చూచానన్నాడు.

హిందువుగా పుట్టిన అంబేద్కర్ హిందువుగా మరణించలేదు!

నిరంతర కృషితో సాగిన ఆయన జీవితం ఉద్యమాలకు వూపిరిపోసింది. ముఖ్యంగా సాంఘిక సంస్కరణలకు.

అంబేద్కర్ పెక్కు గ్రంథాలు వ్రాశాడు.'ది ప్రాబ్లం ఆఫ్ ది రుపీ' 'ప్రావిన్షియల్ డీ సెంట్రలైజేషన్ ఆఫ్ ఇంపీరియల్ ఫైనాన్స్ ఇన్ బ్రిటిష్ ఇండియా' 'ది బుద్ధా అండ్ కార్ల్ మార్క్స్' 'ది బుద్ధా అండ్ హిజ్ ధర్మ'ప్రధానమైనవి.

ప్రసిద్ధ రచయిత బెవెర్లి నికొలస్ డాక్టర్ అంబేద్కర్ భారతదేశపు ఆరుగురు మేధావులలో ఒకరు అని ప్రశంసించాడు.

మహామేధావిగా, సంఘసంస్కర్తగా, న్యాయశాస్త్రవేత్తగా, కీర్తిగాంచిన డాక్టర్ భీమారావ్ అంబేద్కర్ 1956 డిసెంబర్ 6 న కన్నుమూశాడు.

# ఒక వ్యక్తిగాగాక, ఒక సంస్థగా రాణించిన
# దుర్గాబాయి



1920లో గాంధీజీ ఆంధ్రప్రాంతంలో పర్యటిస్తూ రాజమండ్రివచ్చారు.

కాకినాడ నుంచి బంధువుల ఇంట్లో పెళ్ళికి తల్లిదండ్రులతోపాటు రాజమండ్రి వచ్చింది ఒక అమ్మాయి. ఆ రోజు సాయంత్రం రాజమండ్రిలో గొప్ప సభ జరిగింది. ఆ సభలో గాంధీజీ ఉపన్యసించారు. క్రిక్కిరిసిన జనం. సభలో వాలంటీర్లు హుండీలుపట్టుకుని తిరుగుతూ డబ్బులు వసూలు చేయడం చూచిందా అమ్మాయి. ఆ బాలిక వయస్సు 11 ఏళ్ళుంటాయి. వసూలుచేసే డబ్బు గాంధీగారి కాంగ్రెసునిధికి అని విన్నది. ప్రక్కనున్న ఒకాయనను గాంధీ టోపి ఇమ్మన్నది. ఆ టోపీ చేత పట్టుకుని 'గాంధీనిధికి డబ్బివ్వండి' అంటూ జనం మధ్య తిరిగింది. టోపీ నిండింది. గుంపుల్ని తోసుకుంటూ గాంధీగారున్న వేదిక వద్దకు వెళ్ళాలని ఆ బాలిక ఉబలాటం. ఆయనకు తానే ఆ డబ్బులివ్వాలనుకుంది.

జనం తొక్కిసలాట. ఆబాలిక "బాబూ నన్ను పోనివ్వండి. మహాత్మునికి పైకం ఇస్తా" అంటూ వుంది. ఆ బాలికను చూచి ముగ్ధుడైన ఓపెద్దమనిషి, ఆ అమ్మాయిని భుజాలపై కూర్చుండజేసి, గాంధీజీ ముందు దించాడు.

'బాపూ – ఈ డబ్బులు తీసుకోండి' అన్నది. నవ్వుతూ అందుకుని "నీ చేతికున్న గాజులు కూడా ఇవ్వు"

వెంటనే సంతోషంగా 'బాపూ తీసుకోండి' అంటూ గాజులు రెండింటిని

అందించింది; గాంధీజీ ఆనందంతో నవ్వాడు.

ఆ చిరునవ్వు ఆమె హృదయంపై చెఱగని ముద్ర వేసింది. ఆ నవ్వే ఆమె జీవితానికో స్ఫూర్తినిచ్చింది. ఆ పదుకొండేళ్ళ బాలికే దుర్గాబాయి!

అప్పటికే ఆమె హిందీ పాఠశాల పెట్టి 40 మంది మహిళలకు హిందీ నేర్పుతూ వుండేది. ఆ హిందీ పాఠశాల విద్యార్థినులలో ఒక విద్యార్థి దుర్గాబాయి తల్లి కృష్ణ వేణమ్మ!

దుర్గాబాయి 1909 జులై 15 తేదీన రాజమండ్రిలో జన్మించింది. తండ్రి ఆర్.వి.యన్. రామారావుగారు. తల్లి కృష్ణవేణమ్మ. దుర్గాబాయిగారి అమ్మమ్మ గారున్నది రాజమండ్రిలో. దుర్గాబాయి తాతగారైన మనోహరం పంతులు పోలీసు సూపరింటెండెంటు. సంఘ సంస్కరణాభిలాషకల మనోహరంపంతులు వీరేశలింగం పంతులుగారి కెంతగానో అండగా వుండేవారు.

దుర్గాబాయి ప్రతిభావతి. బాల్యంలోనే హిందీలో పాండిత్యం గడించింది. వీణావాదనలో దిట్ట అనిపించుకున్నది. రంగవల్లులు వేయటంలో ఆమెకు ఆమే సాటి. హిందీపాఠశాలలో పాటలు, పద్యాలు, నాటికలు, కోలాటాలు, దేశభక్తి గేయాలు నేర్పించేదా బాలికా ప్రిన్సిపాల్!

1927 లో గాంధీజీ కోటిరూపాయల నిధిసేకరణ చేస్తూ ఆంధ్రపర్యటనకు వచ్చారు. రాజమండ్రి సమీపంలోని సీతానగరం ఆశ్రమంలో బస చేశారు.

ఆ కాలంలో భోగం మేళాలు ఎక్కువగా వుండేవి. దేవదాసీల జీవితం దుర్భరంగా వుండేది. వారేకాక ముస్లిం మహిళలు కూడా సంప్రదాయాలకు బానిసలై బయటి ప్రపంచంతో సంబంధాలు లేకుండా వుండేవారు. వారికో వెలుగుచూపాలని నిశ్చయించింది దుర్గాబాయి. స్త్రీల కోసం ప్రత్యేక సభ ఏర్పాటు చేసి, ఆ సభలో గాంధీజీగారిచే ఉపన్యాసం ఇప్పించాలనుకున్నది.

కాంగ్రెస్ నాయకులైన బులుసు సాంబమూర్తి, కొండా వెంకటప్పయ్యగార్ల వద్దకు వెళ్ళి దుర్గాబాయి తన కోర్కెను వెళ్ళడించింది.

'ఏమిటీ! స్త్రీల సభ ఏర్పాటు చేస్తావా? గాంధీజీ రావాలా? ఏమిటీ పిల్లచేష్టలు?' అన్నారు కొండా వెంకటప్పయ్యగారు.

'అయిదువేల నిధి సమర్పిస్తే, గాంధీగారిని అయిదు నిమిషాలు మాట్లాడమని చెబుతాం' అన్నారు బులుసు సాంబమూర్తిగారు.

'సరే, అయిదువేలు ఇస్తాం' అన్నది. దేవదాసీల వద్దకు వెళ్ళి జరిగినదంతా చెప్పిందామె.

వారం రోజుల్లో అయిదు వేలు వసూలు చేశారు. 'అయ్యా, ఇదిగో అయిదు వేలు - ప్రోగ్రాం ఏర్పాటు చేయండి' అన్నది దుర్గాబాయి.

మునిసిపల్ హైస్కూల్ హెడ్‌మాస్టరు గారిని బతిమిలాడి, స్కూల్ మైదానంలో సభ జరుగుటకు అనుమతి సంపాదించిందామె.

అంతా స్త్రీలే. దేవదాసీలు, పరదాలు వేసుకున్న ముస్లిం మహిళలు!

గాంధీజీ ఉపన్యాసం ప్రారంభిస్తూ 'నా ఉపన్యాసాన్ని దుర్గ తెలుగులో అనువదిస్తుంది. మీరు కూర్చోండి' అన్నారు కొండా వెంకటప్పయ్యగారిని.

అయిదు నిమిషాలంటూ ప్రారంభించిన గాంధీజీ గంటసేపు మాట్లాడారు. బీదల కోసం డబ్బులివ్వండి అన్నారు. మహిళలు తమ గాజులు, ఒంటి మీద ఆభరణాలు తీసి ఇచ్చారు. దుర్గాబాయి అయిదువేల నిధి సమర్పించింది. సభ లోని మహిళలిచ్చిన ఆ నగలు, నగదు పాతిక వేలు మించింది!

గాంధీజీ దుర్గాబాయిని తన కారులో కూర్చోమన్నారు. ఆ బాల దుర్గాబాయిని ఎంతగానో మెచ్చుకున్నారు. ఆంధ్ర పర్యటన అంతా దుర్గాబాయి, అనువాదకురాలుగా సాగింది.

మద్రాసులో జరిగిన ఉప్పు సత్యాగ్రహంలో ఆమె నాయకురాలు. రెండేళ్ళ జైలుశిక్ష తర్వాత విడుదలయిందామె.

పట్టుదలకు ప్రతీక దుర్గాబాయి. ప్రైవేటుగా, బెనారస్ యూనివర్సిటీ నుండి మెట్రిక్యులేషన్ పాసై, అక్కడే ఇంటర్మీడియేట్ పాసైయ్యారు. అక్కడే బి.ఏ. (ఆనర్స్) చదవాలనుకున్నారు. వీలుకాలేదు. వాల్టేర్ వచ్చి ఆంధ్ర యూనివర్సిటీలో చేరాలని, వైస్ ఛాన్సలర్ డా. సి. ఆర్. రెడ్డిగారిని కలుసుకున్నారు. మహిళలకు ప్రత్యేకంగా హాస్టల్ లేనందున, వీలుకాదన్నారు. పది మంది మహిళల అప్లికేషన్లు అందించి, మరలా అభ్యర్థించగా డా. రెడ్డిగారు అనుమతించారు. దుర్గాబాయి బి.ఏ. (ఆనర్స్)లో మొదటి శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. మద్రాసు లా కాలేజిలో బి.ఎల్. పట్టాపుచ్చుకున్నారు. సివిల్ మరియు క్రిమినల్ కేసులను చేబట్టి, బాగా పేరు సంపాదించారామె.

మద్రాసులో ప్రాక్టీసు చేస్తూ, ఆమె ఆంధ్రమహిళా సభ భవన నిర్మాణానికి పూనుకున్నారు. కస్తూరిబా నిధికి వేలాది రూపాయలు వసూలు చేసి గాంధీజీకి ఇచ్చారు.

ఆమె ప్రతిభా సామర్థ్యాలను గుర్తించిన నాయకులు ఆమెను రాజ్యాంగసభ సభ్యురాలుగ ఎన్నుకున్నారు. డాక్టర్ అంబేద్కర్, అల్లాడి కృష్ణస్వామి అయ్యర్, బి.ఎన్. రావు వంటి ఉద్దండులతో కలసి ప్రాథమిక హక్కులు, స్త్రీలకు ఆస్తిహక్కు మున్నగు అంశాలను రాజ్యాంగంలో చేర్పించారు.

1950 తర్వాత ఆమె సాంఘిక సేవారంగం లో ప్రవేశించారు. ప్రధాని జవహర్ లాల్ నెహ్రూగారు పాతిక వేల రూపాయల చెక్కు ఇచ్చి రాయలసీమలో క్షామ నివారణ పథకాల పర్యవేక్షణకు పంపారు.

1952లో దుర్గాబాయిగారిని ప్లానింగ్ కమిషన్ మెంబరుగా ప్రభుత్వం నియమించింది. 1953 సెంట్రల్ సోషల్ వెల్ఫేర్ బోర్డు ఛైర్మన్‌గా వుంటూ పదేళ్ళు పని చేశారు. ఆ సమయం లోనే మహామేధాని కేంద్ర ఆర్థిక శాఖ మంత్రిడాక్టర్ చింతామణి దేశ్‌ముఖ్ గారిని పెళ్ళాడారు. అతి నిరాడంబరంగా జరిగిన పెళ్ళికి పెద్దలు

జవహర్‌లాల్ నెహ్రూ, ఆచార్యకృపలాని మాత్రం వచ్చారు.

కేంద్ర సంక్షేమ సంఘం అధ్యక్షురాలుగ ఆమె అవిశ్రాంతంగ కృషి చేశారు. 1957లో డా. దేశ్‌ముఖ్ ఆర్థిక శాఖ మంత్రి పదవికి రాజీనామా చేసి, యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ ఛేర్మన్‌గా నెలకు ఒక రూపాయి వేతనంతో మూడేళ్ళు పని చేశారు. అప్పట్లోనే ఇంటర్నేషనల్ మానిటరీ ఫండ్(ప్రపంచ ఆర్థిక సంస్థ) డైరెక్టర్ జనరల్‌గా, డా. దేశ్‌ముఖ్ గారిని ఆహ్వానించారు. ప్రధాని నెహ్రూ ఆపదవిని స్వీకరించడం భారతదేశానికి గర్వకారణం కాగలదన్నారు. ఏడాదికి 30 వేల డాలర్ల వేతనం, ఇతర వసతులన్నీ కల్పిస్తామన్నారు. డా. దేశ్‌ముఖ్, దుర్గాబాయిగారి సలహా కోరగా,'అంత డబ్బు మనకెందుకు? మన దేశపు ప్రజల సేవ చేద్దాం. ఆ పదవి వద్దు' అన్నారు దుర్గాబాయి. అంత పదవిని సంతోషంగా వదులుకున్నారా దంపతులు.

1967లో దేశ్‌ముఖ్ దంపతులు ఢిల్లీ వదలి హైదరాబాదులో స్థిరపడినారు. తమ ఇంటికి 'రచన' అని పేరు పెట్టుకున్నారు.

ఆంధ్ర మహిళా సభ కార్యక్రమాలు మూడు పూవులారుకాయలుగా విస్తరించాయి. నర్సింగ్ హోమ్, ఆర్థోపెడిక్ సెంటర్, శిశు విహార్, నర్స్‌స్ హాస్టల్ మరెన్నో వైద్యశాల భవనాలు ఆమె సేకరించిన విరాళాలతో వెలిశాయి. దాదాపు 23 సంస్థలకు ఆమె మూలకారకురాలు.

దేశ్‌ముఖ్ దంపతులు తమ ఆస్తిపాస్తులన్నిటినీ సేవా సంస్థల స్థాపనకు విరాళంగా ఇచ్చారు. 26 ఏళ్ళ దాంపత్య జీవితం సేవా మయంగా సాగింది.

నిరంతర పరిశ్రమ, కార్యదీక్ష, పట్టుదల నిజాయితీ అన్నీ మూర్తీభవించిన మహిళామణి దుర్గాబాయి.

1971లో ఆమె వయోజన విద్యావ్యాప్తికి చేసిన కృషికి 'నెహ్రూ లిటరసీ' అవార్డు ఇచ్చి సత్కరించింది భారత ప్రభుత్వం.

1975 జనవరి 26న ఆమెను 'పద్మవిభూషణ'తో ప్రభుత్వం సత్కరించింది.

లాయరుగా జమీందారుల కేసులన్నీ కోర్టులో వాదించి, గెలిచి వారినుంచి తీసుకున్న ఫీజుల మొత్తమును ఆంధ్ర మహిళా సభకు ఇచ్చిన త్యాగమూర్తి శ్రీమతి దుర్గాబాయి.

'స్వతంత్ర పత్రికలో ఖాసా సుబ్బారావు గారు ఇలా వ్రాశారు.

"దుర్గాబాయి విసుగు విరామం లేని మనిషి, తన సహచరులను కూడా తనలాగే విరామమెరుగని సేవాతత్పరులుగా ఆవేశపూరితులుగా చేయగల నాయకురాలామె. జీవితంలో ఓటమి వుంటుందేమో అన్న భయం ఆమెకు లేదు.... సహారా ఎడారిలో కూడా ఆమెకు చేయటానికి ఏదో సేవాకార్యక్రమం కనిపిస్తుంది."

సామాన్య వ్యక్తిగాకాక మహోన్నత వ్యవస్థగా దేశ ప్రజలకు సేవలందించిన దుర్గాబాయి గారు 1981 మే 9వ తేదీన కన్నుమూశారు.

జాతి గర్వించదగిన మహామేధావి
# డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్



అది 1952 ఏప్రిల్ 5వ తేదీ. మాస్కో నగరం. రష్యా అధినేత స్టాలిన్ నుండి భారతరాయబారి కార్యాలయానికి ఒక లేఖ అందింది. భారత రాయబారి, డా.రాధాకృష్ణన్‌గారిని ఆహ్వానిస్తూ స్టాలిన్ వ్రాసిన లేఖ అది. అందరికీ ఆశ్చర్యం కల్గించింది. సాధారణంగా స్టాలిన్ విదేశీ రాయబారులను చూచేవాడు కాదు. అదివరలో శ్రీమతి విజయలక్ష్మి పండిట్ 18 మాసాల పాటు రష్యాలో భారత రాయబారిణిగా పనిచేశారు. కాని ఆమెకు రష్యా అధినేత మార్షల్ స్టాలిన్ తో ఇంటర్వ్యూ లభించలేదు.

రాధాకృష్ణన్ తత్వవేత్త. చాల సౌమ్యుడు. రాజకీయాలు, దౌత్యవ్యవహారాలతో ఆయనకు అంతగా పరిచయం లేదు. స్టాలిన్ ను చూద్దామా అతి క్రూరుడని, అతని తత్వానికి రాధాకృష్ణన్ కు ఏమాత్రం పడదని అందరూ అన్నారు. రాయబారిగా రష్యా వచ్చిన రాధాకృష్ణన్ రోజుకు పద్దెనిమిది గంటలు పుస్తకాలు చదవటం, వ్రాయటంలో గడుపుతుంటాడని విన్నాడు స్టాలిన్.

ఆహ్వానం అందుకున్న డా. రాధాకృష్ణన్ రాయబార కార్యాలయోద్యోగి రాజేశ్వర్ దయాళ్ తో పాటు స్టాలిన్ వున్న గదిలో ప్రవేశించారు. రష్యావిదేశాంగమంత్రి విటాన్‌స్కీ స్టాలిన్ ప్రక్కనే ఉన్నారు. పావ్‌లోవ్ దుబాసిగా వున్నాడు. ఆ

సమావేశాన్ని వివరిస్తూ రాధాకృష్ణన్ ఇలా వ్రాశారు.

"మా సంభాషణలో అశోక చక్రవర్తి ప్రస్తావన వచ్చింది. ఆయన పెక్కు యుద్ధాలు చేశాడని, వేలాది ప్రజలను చంపి యుద్ధంలో విజయం సాధించాడని, చివరకు ఆ మహారాజు సన్యాసిగా మారిపోయాడు అంటూ కళింగ యుద్ధం గురించి చెప్పాను. అశోకుని పరిస్థితి మీకూ కలగవచ్చు అన్నాను. అందుకు స్టాలిన్, 'అవును అద్భుత సంఘటనలు సంభవిస్తాయి' అన్నాడు. సమావేశం చివర నేను స్టాలిన్ చెక్కిళ్ళను నిమిరి వీపుపై తట్టాను. ఆయన తలపై నా చేతిని ఆడించాను. అప్పుడు స్టాలిన్

" అయ్యా, నన్ను రాక్షసునిగాకాక, మనిషిగా గుర్తించిన వారు మీరొక్కరే. మీరు త్వరలోనే స్వదేశానికి తిరిగి వెళ్తున్నట్లు విన్నాను. అందుకు విచారిస్తున్నాను. నేను ఇక ఎంతోకాలం బ్రతకను." అన్నాడు. తర్వాత ఆరు నెలలకే చనిపోయాడు స్టాలిన్.

గాంధీజీ హత్యకు గురి అయ్యే కొద్ది రోజులముందు రాధాకృష్ణన్ గాంధీజీని కలుసుకున్నారు. తాను రచించిన 'భగవద్గీత' ఆంగ్లానువాదాన్ని గాంధీకి అంకితం చేయదలచినట్లు చెప్పారు రాధాకృష్ణన్. అందుకు గాంధీజీ సమాధానమిస్తూ "మీ రచనలు చాలా గొప్పవి. కాని నా అభిప్రాయం వినండి. నేను, మీ అర్జునుణ్ణి. మీరు నా కృష్ణభగవాన్ " అన్నాడు గాంధీజీ. ఇలా మహాత్ముని మన్ననలందుకున్న మహా పండితుడు, రాధాకృష్ణన్.

## జననం - విద్యాభ్యాసం

శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్ 5-9-1888న మద్రాసుకు 40 మైళ్ళ దూరంలోని తిరుత్తణి లో జన్మించారు. తండ్రి వీరాస్వామయ్య. ఒక జమీందారీలో తహసిల్దార్. ప్రాథమిక విద్య తిరుత్తణిలో సాగింది.తిరుపతి, నెల్లూరు, మద్రాసు క్రిస్టియన్ కాలేజీ మున్నగుచోట్ల చదివి ఎం.ఏ. పట్టా పొందారు. బాల్యం నుండి అసాధారణమైన తెలివి తేటలు గలవాడాయన. విద్యార్థిగా వున్నపుడు, మనస్తత్వశాస్త్రంపై చేసిన ఉపన్యాసాలు అందరినీ అలరించేవి.

21 సంవత్సరాలైనా దాటని వయసులో ఆయన మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ప్రొఫెసర్ అయ్యారు. తత్వశాస్త్రంలో అతని ప్రతిభను విని మైసూరు విశ్వవిద్యాలయం అతనిని ప్రొఫెసర్‌గా నియమించింది. ఆయన ఉపన్యాసాలను ఎంతో శ్రద్ధగా వినేవారు విద్యార్థులు. కలకత్తా విశ్వవిద్యాలయంలో ఆచార్య పదవిచేపట్టమని, డా. అశుతోష్ ముఖర్జీ, రవీంద్రనాథటాగూర్‌లు కోరారు. కలకత్తా వెళ్ళాలని నిశ్చయించుకున్నారు రాధాకృష్ణన్. ఆయన ఇంటిముందు గుర్రపుబండి సిద్ధంగా ఉంది. తమ అధ్యాపకునికి వీడ్కోలు చెప్పటానికై విద్యార్థులు ఆయన ఇంటికి వచ్చారు. బండికి కట్టిన గుర్రాలను వదలించారు. రైల్వే స్టేషన్ దాకా బండిని తామే లాక్కొని వెళ్ళారు. అది విద్యార్థులకు ఆయన పట్ల వున్న ప్రేమకు సంకేతం. విద్యార్థుల భక్తిశ్రద్ధలను గమనించిన రాధాకృష్ణన్ కళ్ళు చెమ్మగిల్లాయి. అది గురుశిష్యుల హృదయానుబంధం. ఆ ప్రేమానుబంధం ఈనాడు అంతగా కానరాదు.

కలకత్తా విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగా వున్నప్పుడు ఆయన 'భారతీయ

తత్వశాస్త్రం'అన్న గ్రంథం వ్రాశాడు. ఆ గ్రంథం విదేశ పండితుల ప్రశంసలందుకున్నది.

"మీరు ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం నుండి డిగ్రీ తీసుకుని వుంటే మీకు మరింత గొప్ప పేరు వచ్చేది"అన్నాడొక మిత్రుడు. అందుకు బదులుగా, డా. రాధాకృష్ణన్ "నేను ఆక్స్‌ఫర్డ్ వెళ్తే, అధ్యాపకుడిగా మాత్రమే వెళ్తాను. కాని విద్యార్థిగా మాత్రం వెళ్ళను"అన్నాడు. అలా అన్న ఆరేళ్ళ తర్వాత ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం వారి ఆహ్వానంపై, ప్రాచ్య తత్వశాస్త్రంపై ఉపన్యాసాలిచ్చేందుకు వెళ్ళారు. ఇంగ్లండ్, ఫ్రాన్స్, అమెరికాలలో పలుచోట్ల ఉపన్యాసములిచ్చి మాతృదేశం వచ్చారు.

1931లో డా. సి.ఆర్.రెడ్డి గారి తర్వాత రాధాకృష్ణన్‌గారు ఆంధ్రవిశ్వవిద్యాలయం వైస్ ఛాన్సిలర్‌గా పనిచేశారు. అప్పట్లో డా. రాధాకృష్ణన్‌గారి పిలుపు ననుసరించి ప్రొఫెసర్ హిరేన్ ముఖర్జీ, హుమయూన్ కబీర్‌వంటి మేధావులు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్లుగా పనిచేశారు.

1931లోనే రాధాకృష్ణన్ "లీగ్ ఆఫ్ నేషన్స్ 'ఇంటెలెక్చ్యుయల్ కో-ఆపరేషన్ కమిటి ' సభ్యులుగా ఎన్నుకోబడినారు. 1936లో ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో ప్రాచ్యమతాల గౌరవాధ్యాపకులయ్యారు. చైనా, అమెరికా దేశాల్లో పర్యటించి పెక్కు ప్రసంగాలు చేశారు.

1946లో ఏర్పడిన భారత రాజ్యాంగ పరిషత్ సభ్యులయ్యారు. 1947 ఆగష్టు 14-15తేదీన మధ్యరాత్రి 'స్వాతంత్ర్యోదయం'సందర్భాన శ్రీ రాధాకృష్ణన్ చేసిన ప్రసంగం సభ్యులను ఎంతో ఉత్తేజపరిచింది.

1949లో భారతదేశంలో ఉన్నత విద్యాసంస్కరణలు ప్రవేశ పెట్టాలన్న లక్ష్యంతో ప్రభుత్వం ఒక కమిటి నియమించింది. దానికి అధ్యక్షుడు డా. రాధాకృష్ణన్.

డా.రాధాకృష్ణన్, ప్రధాని నెహ్రూ కోరిక మేరకు 1952-62 వరకు భారత ఉపరాష్ట్రపతిగా పనిచేశారు.

## రచనలు

ముఖ్యమైన ఉపనిషత్తులు, ఈస్ట్ అండ్ వెస్ట్ సమ్-రిఫ్లెక్షన్, రికవరి ఆఫ్ ఫేత్, ఎ సోర్స్ బుక్ ఇన్ ఇండియన్ ఫిలాసఫి, కాన్సెప్ట్ ఆఫ్ లైఫ్ వంటి చాలా గొప్ప గ్రంథాలు రచించినారు.

1962లో బాబూ రాజేంద్రప్రసాద్ రాష్ట్రపతి పదవి నుండి విరమించుకున్నారు. వారి తర్వాత రాష్ట్రపతిగా వున్న డా.రాధాకృష్ణన్ అయిదేళ్ళ కాలంలో ఎన్నో దేశాల్లో పర్యటించారు. అసమానమైన వాగ్ధాటితో, ప్రాచ్య పాశ్చాత్య తత్వశాస్త్రాలపై చేసిన ఉపన్యాసాలు అన్ని దేశాల వారిని ఆశ్చర్య పరచాయి.

## ఛలోక్తులు

ఆయన ఉపన్యాసాల్లో ఛలోక్తులు, హాస్యోక్తులు దొర్లేవి. ఒకసారి సర్. మహమద్ ఉస్మాన్ (ఒకప్పుడు మద్రాసు రాష్ట్ర మంత్రి)డా.రాధాకృష్ణన్ ఒకే సభలో మాట్లాడారు. సర్. మహమద్ ఉస్మాన్‌ను గురించి మాట్లాడుతూ, "శ్రీ ఉస్మాన్ నాకు

చాలా సన్నిహిత మిత్రుడు. ఆయన కాలేజీలో మొదట సీనియర్. ఆ తర్వాత నా క్లాస్‌మేట్. తర్వాత నా జూనియర్ నేను మద్రాసులో ప్రొఫెసర్‌గా వున్నప్పుడు ఆయన అదే యూనివర్సిటీ వైస్ ఛాన్స్‌లర్. నేను వైస్ ఛాన్సలర్‌గా వుండినపుడు ఆయన ఛాన్స్‌లర్."

రాధాకృష్ణన్, మానవజీవితంలో మంచిని పెంచాలని, ఉత్తమ సమాజాన్ని రూపొందించాలని, మతాన్ని సరిగా అర్థం చేసుకోవాలని బోధించారు. మానవుల్లోని మమతానురాగాలను పెంచుటకు ప్రపంచం కృషి చేయాలన్నారు. అహింసా విధానం ద్వారా ప్రపంచ దేశాలన్ని శాంతిని పెంచాలన్నారు.

ప్రపంచంలోని పలు విశ్వవిద్యాలయాలు వారిని గౌరవ డాక్టరేట్లతో సత్కరించాయి. 1969లో భారత ప్రభుత్వం వారిని 'భారత రత్న'తో సత్కరించింది. 1975లో 'టెంపుల్ టన్'బహుమతి ద్వారా లభించిన 96 వేల డాలర్ల మొత్తాన్ని ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో భారతీయ సంస్కృతిపై ప్రసంగాలు యిచ్చేందుకు ఏర్పాటు చేశారు. రాధాకృష్ణన్‌గారు, డా. కె. యం. మున్షీగారితో కలసి భారతీయ విద్యాభవన్ స్థాపించారు.

మహామేధావిగా, గొప్పవ్యక్తిగా, గొప్ప గ్రంథకర్తగా, తత్వవేత్తగా, ప్రపంచ దేశాల మన్ననలందుకున్న డా. రాధాకృష్ణన్ భారతీయ మహర్షులకోవకు చెందిన వారు.

రాష్ట్రపతి పదవీ విరమణ చేసిన తర్వాత (1967)చివరి రోజు వరకు మద్రాసులోని తమ భవనంలో, తాత్విక చింతన చేస్తూ 17.4.1975న పరమపదించారు.

ఆచార్యునిగ ఆయనను గుర్తించిన భారత దేశం, రాధాకృష్ణన్ జన్మదినమును ఉపాధ్యాయదినంగా దేశమంతటా ఏటా జరుపుకోవడం ఎంతో సముచితం.

## అంతా తలరాత - అన్న అలస భావం పోగొట్టిన

# 'భారతరత్న' మోక్షగుండం విశ్వేశ్వరయ్య



"ప్రజల సంపాదనాశక్తిని, కార్యదక్షతను నైపుణ్యాన్ని వివిధములైన చేతుపనుల ద్వారా పెంపొందించాలి. చేతనైన వారందరూ కష్టించి పని చేసే వీలు కల్పించాలి. యాంత్రిక శక్తిని వినియోగించుకుని దేశపారిశ్రామిక ప్రగతికి ముందంజవేయాలి. భారతీయులలో ప్రబలంగా వున్న 'అంతా తలరాత 'అన్న అలసభావం రూపుమాపి నిరంతర కృషి ద్వారా సంపదను సాధించే దీక్షను, కర్తవ్య పాలనను ప్రజలలో రేకెత్తించుట ప్రభుత్వం కర్తవ్యం."

1912 మైసూరు సంస్థాన దివానుగా అధికారాన్ని చేపడుతూ శ్రీ విశ్వేశ్వరయ్య చేసిన ప్రసంగం నుండి పై వాక్యాలు ఉటంకింపబడినాయి. విశ్వవిఖ్యాత ఇంజనీర్‌గా, పాలనాదక్షుడుగ, రాజనీతిజ్ఞుడుగ, నిష్కామదేశభక్తుడిగ అఖండ కీర్తిని ఆర్జించిన మహనీయుడు శ్రీ మోక్షగుండం విశ్వేశ్వరయ్య.

విశ్వేశ్వరయ్య పూర్వీకులు నేటి ప్రకాశం జిల్లాలోని మోక్షగుండం గ్రామం నుండి సుమారు రెండు శతాబ్దాల క్రితం, కర్ణాటక రాష్ట్రం (అప్పట్లో మైసూరు) లోని, చిక్క బళ్ళాపుర సమీపంలోని ముద్దేనహళ్ళిలో స్థిరపడినారు. అక్కడే విశ్వేశ్వరయ్య 1861 సెప్టెంబర్ 15వ తేదీన జన్మించారు. తండ్రి శ్రీనివాస శాస్త్రి. తల్లి వెంకట లక్ష్మమ్మ. వారిదో సామాన్య కుటుంబం. బాల్యంలోనే తండ్రి మరణించాడు.

మేన మామ రామయ్య బాలుడైన విశ్వేశ్వరయ్యను చేరదీసి బెంగుళూరు సెంట్రల్ కాలేజీలో చదువుకునే ఏర్పాటు చేశాడు.

విశ్వేశ్వరయ్య గారి విద్యార్థి జీవితం విద్యాభ్యాసం సాగించే వారందరికి దిక్సూచి. మేనమామ ఇంట్లోవుంటూ కాలేజీ ఫీజులకోసం ప్రైవేట్ ట్యూషన్ చెబుతూ 1881లో పట్టభద్రులయ్యారు. సెంట్రల్ కాలేజీ ప్రిన్సిపల్ ఛార్లెస్ వాటర్స్ విశ్వేశ్వ రయ్య నెంతగానో ప్రోత్సహించాడు. గణితంలో అసామాన్య ప్రతిభకల విశ్వేశ్వరయ్య గారి నుండి అధ్యాపకులే తమ సంశయాలను పరిష్కరించుకునేవారు. శిష్యుని కుశాగ్ర బుద్ధికి ముగ్ధుడైన ప్రిన్సిపల్ తాను ఉపయోగించుకునే వెబ్‌స్టర్ డిక్షనరీని బహుమానంగా ఇచ్చాడు. తన కోటుకున్న బంగారు బొత్తాములను భార్యద్వారా శిష్యుడు విశ్వేశ్వరయ్యకు పంపారు. అదీ ఆనాటి గురుశిష్యుల అనుబంధం – శిష్యవాత్సల్యం.

ఇటువంటి పెద్దలు ఆదరించినందువల్లనే బాలుడైన విశ్వేశ్వరయ్య, ఆ తర్వాత డా. ఎం.వి.:సర్. ఎం.వి : 'భారతరత్న'ఎం.వి. అంటూ ప్రస్తుతింపబడినారు. అప్పట్లో మైసూరు సంస్థాన దివానుగా వుండిన దివాన్ రంగాచార్లుగారు విశ్వేశ్వరయ్య విద్యావినయములను గుర్తించి ఇంజనీరింగ్ విద్యాభ్యాసం సాగించేందుకు స్కాలర్ షిప్ మంజూరు చేసి, పూనేకు పంపారు. ఇంజనీరింగ్ పరీక్షలో బొంబాయి రాష్ట్రంలో సర్వప్రథముడుగా ఉత్తీర్ణులైన విశ్వేశ్వరయ్యగారిని రాష్ట్ర ప్రభుత్వం నేరుగా అసిస్టెంట్ ఇంజనీర్‌గా నియమించింది. ఏడాది లోపునే ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ గా నియమించారు. ఆ రోజుల్లో అందులోను ఆంగ్లేయుల పాలనలో అంత త్వరలోనే పదవీ ఉన్నతిని పొందడం చాల అరుదు. పునేలో ఉన్నప్పుడే గోఖలే, తిలక్, రనడే వంటి మహనీయుల సాహచర్యం విశ్వేశ్వరయ్య గారికి లభించింది. గాంధీజీ, నెహ్రూల కంటే వయస్సులో పెద్ద విశ్వేశ్వరయ్య.

ఆంగ్ల పాలకులు విశ్వేశ్వరయ్యగారి కార్యదీక్షను గుర్తించి ప్రపంచ జలాశయాలలో ఒకటిగ గొప్పదైన సుక్కూర్ బరాజ్ (సింధురాష్ట్రం) నిర్మాణానికి ప్రత్యేక ఇంజనీర్‌గా నియమించారు. బ్రహ్మాండమైన ఈ జలాశయ నిర్మాణం నాలుగేళ్ళలో పూర్తి అయింది.

1901లో భారత ప్రభుత్వ ప్రతినిధిగ విశ్వేశ్వరయ్యగారు జపాన్ దేశం వెళ్ళి అచట కుటీర పరిశ్రమల తీరుతెన్నులను అవలోకించారు. ఆ పద్ధతిలో కుటీర పరిశ్రమల అభివృద్ధికి బృహత్ పథకాన్ని సిద్ధపరచి ప్రభుత్వానికి అందించారు. జపాన్ పర్యటనా నంతరం, విశ్వేశ్వరయ్యగారు పూనా నగర నీటి సరఫరా పథకాన్ని రూపొందించారు. ఈ నిర్మాణ కాలంలోనే ఆటోమేటిక్ స్లూస్‌గేట్ రూపొందించారు. ఈ స్లూస్‌గేట్ నిర్మాణం ప్రపంచ ఇంజనీర్ల మన్ననలందుకున్నది. ఈ కొత్త పరిశోధనను తన పేరు మీద పేటెంట్ చేసుకోవలసిందిగ మిత్రులు సూచించారు. తన కార్యనిర్వహణలో భాగంగా సాగినదికాన పేటెంట్ తీసుకోవటం సముచితంకాదన్నాడు. లార్డ్ కిచనర్ స్లూస్‌గేట్ నిర్మాణంలో విశ్వేశ్వరయ్య ప్రతిభను కొనియాడాడు.

1906లో ఏడెన్ నగరం నీటి, సరఫరా ప్రణాళికను రూపొందించారు. ప్రభుత్వం

విశ్వేశ్వరయ్యగారిని సూపరింటెండెంట్ ఇంజనీర్‌గా నియమించింది. అప్పుడే కొల్హాపూర్, ధార్వాడ,బిజాపూర్ మొదలగు పట్టణాలలో మంచినీటి పథకాలను సిద్ధ పరచారు. బొంబాయి రాష్ట్ర ప్రభుత్వోద్యోగాన్ని స్వయంగా వదులుకున్నారు. రెండు సంస్థానాల నుండి చీఫ్ ఇంజనీర్ పదవులు చేపట్టమని ఆహ్వానాలు వచ్చాయి. అన్నిటిని తిరస్కరించి ఇటలీ, రష్యా, ఫ్రాన్స్, జర్మని మొదలగు దేశాలలోని బృహన్నిర్మాణములను పరిశీలించి, ఆయాదేశ శాస్త్రవేత్తలతో సంప్రదింపులు జరిపి 1909లో స్వదేశం వచ్చారు.

ఇటలీ పర్యటనలో ఉన్నపుడే హైదరాబాద్ నగర రక్షణా పథకం నిర్మించుటకు స్పెషల్ చీఫ్ ఇంజనీర్‌గా ఆహ్వానించాడు నిజాం. విశ్వేశ్వరయ్యగారి నేతృత్వంలో సాగినవే హుసేన్‌సాగర్, హైదరాబాదు నగర విస్తృత పథకాలు.

స్వరాష్ట్రమైన మైసూరు సంస్థానాన్ని ఆదర్శ సంస్థానంగా తీర్చి దిద్దిన వారు ఆయన. చీఫ్ ఇంజనీర్‌గా, ఆ తర్వాత దివాన్‌గా పనిచేసిన ఆరేళ్ళలో ఆరువదేళ్ళ అభివృద్ధిని సాధించారు. హెబ్బాళ్ వ్యవసాయ కళాశాల, మైసూరు విశ్వవిద్యానిలయం, ఛేంబర్ ఆఫ్ కామర్స్, సోప్ ఫ్యాక్టరి, కన్నడ సాహిత్య పరిషత్ మున్నగు వాటిని నెలకొల్పారు.

విశ్వేశ్వరయ్య గారి ప్రజ్ఞా ప్రతిఫలంగా నిర్మింపబడినదే కృష్ణరాజసాగర్, లక్షలాది ఎకరాల మెట్ట భూములు సస్యశ్యామలంగా మారాయి. బృందావన్ ఉద్యానవనం వారి ప్రకృతి ప్రేమకు నిదర్శనం. భారతదేశ సంస్థానాలలో మొదటి ఉక్కు కర్మాగారం నెలకొల్పినది మైసూరు.

మైసూరు మహారాజా గారితో అభిప్రాయభేదం రాగా రాజీనామా చేసి బొంబాయి వెళ్ళిపోయారు. విదేశీ ఇంజనీర్ల ఆధ్వర్యంలో ప్రారంభింపబడిన భద్రావతి కర్మాగార నిర్మాణ కార్యక్రమం దెబ్బతినింది. మహారాజా గత్యంతరం లేక బొంబాయిలోని విశ్వేశ్వరయ్య గారిని ఆహ్వానిస్తూ 'ఈ కర్మాగార పథకం మీదే, అది ఇప్పుడు రోగ గ్రస్తమైంది. మీరు ప్రారంభించిన ప్రజాప్రతినిధి సభ సభ్యులు దీనిని తెల్ల ఏనుగ అంటూ ఎగతాళి చేస్తున్నారు. మీరు వచ్చి దీనిని పునరుద్ధరించాలి.'అని వ్రాశారు.

కర్మాగార పర్యవేక్షణ, వ్యయం మున్నగు వాటిపై అన్ని అధికారాలు విశ్వేశ్వరయ్య గారు చేపట్టారు. కార్మికులకు కొద్దిగా కూలీ పెంచారు. అవినీతుపరులైన విదేశీ ఇంజనీర్లను తొలగించారు. రేయింబగళ్ళు కార్మికులను ప్రోత్సహిస్తూ నష్టాల ఊబిలో నుండి లేవనెత్తి రెండేళ్లలో లాభాలు చూపించారు. పెద్ద కర్మాగారాల్లో సుశిక్షితులైన భారతీయులనే నియమించాలని అందుకు శిక్షణావకాశాలు పెంచాలన్నారు. భద్రావతి కర్మాగారం పర్యవేక్షకులుగా మహారాజా గారి నుండి లభించిన లక్షా యాభైవేల రూపాయలను తిప్పి పంపుతూ, ఆ పైకంతో పారిశ్రామిక శిక్షణ సంస్థను నెలకొల్పమని రాజాగారిని కోరారు విశ్వేశ్వరయ్య. ఆ సంస్థకు తన పేరు పెట్టుటకు సమ్మతింపలేదు. ఆ విధంగా వెలిసిందే జయ చామరాజేంద్ర ఆక్యుపేషనల్ ఇన్‌స్టిట్యూట్.

విశ్వేశ్వరయ్యగారు 1921లో భారత ఉత్పత్తిదారుల సమాఖ్యను నెలకొల్పి జీవి

తాంతం ఆ సమాఖ్య అధ్యక్షులుగా పనిచేశారు. 1922 లో అఖిలపక్ష రాజకీయ సమ్మేళనానికి, 1923లో ఇండియన్ సైన్స్ కాంగ్రెసుకు అధ్యక్షత వహించారు.

విశ్వేశ్వరయ్య స్వదేశీ సంస్థాన ప్రజలు బ్రిటిష్ ఇండియాలోని ప్రజలకంటే ఎక్కువ బాధలు పడుతున్నారని గ్రహించి వారి స్వేచ్ఛకోసం గొప్ప కృషి చేశారు. మైసూరు సంస్థానంలో ప్రజాప్రతినిధి సభను ప్రారంభించారు.

కర్తవ్య నిర్వహణలో , నిజాయితీలో అటువంటి వారు అరుదు. దివాన్ పదవి స్వీకరించే ముందు బంధుమిత్రులను ఆహ్వానించారు. "నేను దివాన్ పదవిలో వుండగా ఎటువంటి ఉద్యోగాలు కోరమని, సిఫార్సులు చేయమని వాగ్దానం చేయమన్నారు." తన బంధువులను ప్రభుత్వోద్యోగాల నుండి తప్పించి, ఇతర వృత్తులను చేపట్టుటకు సొంత పైకం యిచ్చారు.

మైసూరు సంస్థానంలో మోటార్ కార్ల నిర్మాణం ప్రారంభించాలనుకున్నారు. బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం తిరస్కరించింది. రెండవ ప్రపంచ యుద్ధం వచ్చింది. ఇండియాలో విమాన నిర్మాణం అత్యవసరమైనది. విశ్వేశ్వరయ్య గారి సలహా మేరకు బెంగుళూరులో భారత ప్రభుత్వం విమాన కార్ఖానా నెలకొల్పింది. విశాఖ పట్నంలోని నౌకా నిర్మాణ పథకాన్ని రూపొందించి వాల్ చంద్ హీరాచంద్ గారిచే ప్రారంభింపచేసిన వారాయనే.

గాంధీ - విశ్వేశ్వరయ్యగార్లు దేశాభివృద్ధి సాధనలో భిన్న దృక్పథాలు కలవారు. గాంధీజీ గ్రామీణ పరిశ్రమలకు ఎంతో ప్రాధాన్యత ఇచ్చారు. విశ్వేశ్వరయ్యగారు భారీ పరిశ్రమలకు ప్రాధాన్యత ఇచ్చి కుటీర పరిశ్రమలకు ప్రోత్సహించాలన్నారు.

"నా అభిప్రాయాలు ఎలా ఉన్నా, మీ సహకారం లభించే అదృష్టానికి నోచుకున్నందుకు సంతోషిస్తున్నాను. నా అభిప్రాయాలను వ్యతిరేకించినా, మీ దేశ భక్తి, శక్తిసామర్థ్యాల పట్ల నాకున్న గౌరవం ఏనాటికీ తరగదు." అన్నారు గాంధీజీ.

"మీరేమైనా చెప్పండి. భారత గ్రామీణుల గురించి నాకు మీకంటే ఎక్కువగా తెలుసు"అని గాంధీజీ అన్నప్పుడు, "నేను మీకంటే పదేళ్ళు పెద్దవాడినన్న విషయం గమనించమనవి. దేశ ఆర్థిక ప్రగతి విషయంలో మీ కంటే ఎక్కువ అవగాహన నాకుంది."అంటూ బదులు వ్రాశారు విశ్వేశ్వరయ్యగారు, గాంధీజీకి వ్రాసిన జాబులో.

భారతదేశంలోని పెద్ద జలాశయాలు, ఆనకట్టలు నిర్మించుటలో వారి సలహాలను ప్రభుత్వం గొప్పగా భావించేది.

తొంభైఏళ్ళ వయసులో ప్రధాని నెహ్రూ ఆహ్వానాన్ని మన్నించి పాట్నా వద్ద గంగా నదిపై వంతెన నిర్మాణ పథకాన్ని, కొందరు ఇంజనీర్ల బృందంతో రూపొందించారు. తుంగభద్ర ప్రాజెక్టు పథక శిల్పి వారే.

విశ్వేశ్వరయ్య నిజాయితీకి సాకారం. ఒక మారు విదేశీ పర్యటనకు సిద్ధమయ్యారు. కొంత పైకం కావాల్సి వచ్చింది. మైసూరు బ్యాంక్ మేనేజర్ బి.వి. నారాయణరెడ్డి గారికి ముందుగా ఫోన్ చేసి, బ్యాంక్ కు వెళ్ళారు. మేనేజర్ వారినెంతో గౌరవంగా లోపలికి తీసుకెళ్లారు. అన్ని దరఖాస్తులు సిద్ధమైనాయి. విశ్వేశ్వరయ్య తమ వద్దవున్న

భారత ప్రభుత్వ రుణ పత్రాలను ఇచ్చి తాకట్టు పెట్టుకోమన్నారు. మేనేజర్ ఆశ్చర్యంతో "తాము తాకట్టు పెట్టడమా ! ఇది మీరు నెలకొల్పిన బ్యాంక్"అంటూ తిప్పి ఇవ్వగా విశ్వేశ్వరయ్య తీసుకోలేదు. బ్యాంకు వారు తక్కువ వడ్డి సూచించగా – అందరికీ విధించే వడ్డీ వేయమన్నారు. ఎక్కువ వడ్డీ వేయమని కోరిన వారు విశ్వేశ్వరయ్యగారొక్కరే, అన్నారు బ్యాంక్ మేనేజర్.

విశ్వేశ్వరయ్య వ్యక్తిగత జీవితం అతి క్రమశిక్షణతో వుండేది. రెండు సార్లు భార్యావియోగం కల్గింది. మూడోమారు పెళ్ళాడిన భార్య వ్యవహారం నచ్చక ఆమెకు విడాకులిచ్చారు. కాల నియమాన్ని, ఆహార విహార నియమాలను కచ్చితంగా పాటించిన విశ్వేశ్వరయ్య 100సం. వయస్సులో కళ్ళద్దాలు లేకుండా చదివేవారు. "గంధపు చెక్క వలె సేవలో అరిగిపో, కాని ఇనుములా తుప్పు పట్టవద్దు."అనునది వారి జీవన ధ్యేయం. దేశ విదేశాలలోని విశ్వవిద్యాలయాలు వారిని సత్కరించాయి. 1961లో విశ్వేశ్వరయ్య గారి శతజయంతి ఉత్సవాలకు భారత ప్రధాని నెహ్రూ విచ్చేశారు. "మేము మాటలతో కాల యాపన చేశాం. మీరు నిరంతర క్రియాశూరులై నవభారత నిర్మాణానికి కృషి చేసిన మహనీయు"లంటూ నివాళులర్పించారు నెహ్రూ.

భారత ప్రభుత్వం విశ్వేశ్వరయ్యగారిని 'భారతరత్న' బిరుదంతో సత్కరించింది. విశ్వేశ్వరయ్య ప్లాన్డ్ ఎకానమి ఆఫ్ ఇండియా రికన్స్ట్రక్టింగ్ ఇండియా, మెమాయిర్స్ ఆఫ్ మై వర్కింగ్ లైఫ్ (ఆత్మకథ) రచించారు.

జీవితాంతం దేశ ప్రగతికి, ప్రజా శ్రేయస్సుకు కృషి చేసిన విశ్వేశ్వరయ్యగారు 12–4–1962న దివంగతులయ్యారు.

## తిలక్, మాలవ్యాల ప్రశంసలు పొందిన "కలియుగ భీమ"

# కోడి రామమూర్తి నాయుడు



*'తిండి గలిగితె కండగలదోయ్, కండగలవాడేను మనిషోయ్'*

అంటూ దేశ స్వాతంత్ర్య సంపాదన తర్వాత దానిని పదిలంగా పెంచేందుకు బలవంతులైన ప్రజలు కావాలని ఎలుగెత్తి చాటిన ప్రజాకవి గురజాడ అప్పారావు.

జాతీయోద్యమ వైతాళికులైన లోకమాన్య బాలగంగాధరతిలక్, భారతీయులను స్వాతంత్ర్య సమరంలో చేరమని ఉద్బోధించేవారు. 'స్వరాజ్యం నా జన్మహక్కు' అనే మంత్రోపదేశంతో యువతను ఉత్తేజపరిచేవారు. ఆ మహనీయుని ఆదేశాలను ఆచరణలో చూపాలని, అవిశ్రాంతంగా కృషి చేసిన ఆంధ్ర వీర కంఠీరవ కోడి రామమూర్తి నాయుడు.

'కలియుగ భీమ' బిరుదుగల కోడి రామమూర్తి నాయుడు విశాఖపట్నం జిల్లా వీరఘట్టంలో 1882, ఏప్రిల్ లో జన్మించారు. తండ్రి కోడి వెంకన్న భూకామందు, ఆంగ్లేయులపట్ల భక్తిశ్రద్ధలుకలవాడు. తన కుమారుడు ప్రభుత్వోద్యోగంలో చేరి, మంచి పదవినందుకోవలని ఆశించాడు. కాని ఆయన అనుకున్న దొకటి, జరిగింది మరొకటి.

బాల్యంలోనే తల్లిని కోల్పోయిన కోడిరామమూర్తి అయిదేళ్ళ ప్రాయంలోనే ఇరుగు పొరుగు వారితో చిలిపి జగడాలాడేవాడు. తండ్రి గారు, కుమారుని అల్లరి పనులు సహించలేకపోయారు. వెంకన్నగారు, తన తమ్ముడు కోడినారాయణస్వామి (పోలీస్

ఇన్‌స్పెక్టర్) వద్దకు కొడుకును, చదువుకోసం విజయనగరం పంపాడు.

రామమూర్తినాయుడు, జాతీయోద్యమ నాయకుడు ద్వార బంధాల చంద్రయ్య నాయుడుగారి పట్ల ఆకర్షితుడైనాడు. చంద్ర య్య కోయ యువకుల దండును నెలకొల్పి బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా పోరాటం సాగించాడు. చంద్రయ్యను పట్టి ఇచ్చిన వారికి వేలాది రూపాయల బహుమతి ప్రకటించింది ప్రభుత్వం.

బాలరామమూర్తినాయుడు చదువుల పట్ల శ్రద్ధ చూపకపోయాడు. తండ్రికి కోపం వచ్చి బాగా వాయించాడు. రామమూర్తి ఇల్లు వదలి అడవులు చేరాడు. వారం రోజుల తర్వాత ఒక పులి పిల్లను పట్టుకొని, విజయనగరం వీధుల్లో తిరుగుతున్న రామమూర్తినాయుడును చూచి అందరూ ఆశ్చర్య చకితులయ్యారు. విజయనగరంలో ఉన్నపుడు తాలిమ్‌ఖానాలో చేరి, శరీర వ్యాయామం అభ్యసించాడు. కుస్తీ పట్లన్నీ నేర్చాడు.

ఇక లాభం లేదని, పినతండ్రి కోడి నారాయణస్వామి, రామమూర్తిని సైదాపేట (మద్రాసు)లోని వ్యాయామ శిక్షణ కళాశాలకు పంపాడు. ఏడాది శిక్షణ తర్వాత వ్యాయామోపాధ్యాయుడుగా ,సర్టిఫికెట్ అందుకుని, విజయనగరంలో తాను చదివిన హైస్కూలులో వ్యాయామ శిక్షకుడుగా చేరాడు.

విజయనగరంలో పొట్టి పంతులు అనే మిత్రుని సహకారంతో సర్కస్ కంపెనీ నెలకొల్పాడు. తుని రాజాగారి నుండి సంపూర్ణ సహకారం లభించింది. రామమూర్తి సర్కస్ సంస్థ పలుచోట్ల ప్రదర్శనలిచ్చి మంచిపేరు తెచ్చుకున్నది. తెలుగు జిల్లాల్లో ప్రదర్శనల తర్వాత 1912లో మద్రాసు చేరాడు. పులులు, ఏనుగులు, గుర్రాలు, చైనా, జపాన్, కళాకారుల సహకారం ఆయనకు లభించాయి.

రామమూర్తి ప్రదర్శనలు అందరినీ ఆకర్షించాయి. శరీరమునకు కట్టిన ఉక్కు గొలుసును, ఊపిరితిత్తులలో గాలిని పూరించుకుని ముక్కలుగా తుంచి వేశాడు. రెండు కార్లను రెండు భుజాలకు ఇనుపగొలుసులతో కట్టించుకునేవాడు. కార్లను శరవేగంతో నడపమనేవాడు. కార్లు కదలకుండా పోయేవి. రొమ్ముపై పెద్ద ఏనుగును ఎక్కించుకునేవాడు. 5 నిమిషాల పాటు, రొమ్ముపై ఏనుగును అలాగే ఉంచుకునేవాడు. తండోపతండాలుగా ప్రజలు వారి ప్రదర్శనలు చూచేవారు.

పూనాలో లోకమాన్యతిలక్ గారి కోరిక మేరకు ప్రదర్శనలిచ్చాడు. తిలక్ రామమూర్తిగారికి 'మల్లమార్తాండ', 'మల్లరాజ తిలక్' బిరుదములిచ్చారు. విదేశాలలో భారత ప్రతిభను ప్రదర్శించమని ప్రోత్సహించాడు తిలక్.

హైదరాబాద్ లో ఆంధ్రభాషా నిలయం పెద్దలు ఘనసత్కారం చేసి 'జగదేకవీర' బిరుదమిచ్చారు.

అప్పటి వైస్రాయి లార్డ్ మింటో, రామమూర్తిగారి ప్రదర్శనలను చూడాలని వచ్చాడు. రామమూర్తి అప్పట్లో ఆంజనేయ ఉపాసనలో వుండినందున పదినిమిషాలు వేచాడు. రామమూర్తి ప్రదర్శలను చూచి ముగ్ధుడయ్యాడు. తానే పరీక్షించాలనుకుని

తన కారును ఆపవలసిందని కోరాడు. కారులో కూర్చుని లార్డ్ మింటో కారును నడపసాగాడు. త్రాళ్ళతో కారును తన భుజాలకు కట్టుకున్నాడు. అంతే, కారు ఒక సెంటిమీటర్ కూడా కదలక పోయింది. ఈ సంఘటనతో వైస్రాయి ప్రశంసలను, దేశమంతటా గొప్ప పేరును సంపాదించాడు. రామమూర్తి నాయుడు.

అలహాబాదులో అఖిల భారత కాంగ్రెస్ సభ జరిగింది. రామమూర్తీ సర్కస్ అక్కడ ప్రదర్శనలిచ్చింది. జాతీయ నాయకులెందరో చూచి ఆనందించారు. పండిత మదనమోహన మాలవ్యా ఎంతగానో మెచ్చుకున్నారు. విదేశాలలో ప్రదర్శనలివ్వమని ప్రోత్సహించారు.

సర్కస్ కంపెనీ బాగా పెరిగింది. రామమూర్తిగారు 1600 మంది గల తన బృందంతో లండన్ వెళ్ళి ప్రదర్శనలిచ్చారు. సుప్రసిద్ధ మల్లుడైన గామా పైల్వాన్ తమ్ముడు ఇమామ్‌బక్షీ ఆ బృందంలో వుండేవాడు.

లండన్‌లో రాజదంపతులు జార్జిరాజు, రాణి మేరి, రామమూర్తిగారి ప్రదర్శనలను చూచి తన్మయులయ్యారు. రామమూర్తిగారిని తమ బక్కింగ్ హామ్ రాజభవనానికి ఆహ్వానించి, విందు ఇచ్చిన తర్వాత 'ఇండియన్ హెర్క్యులస్' బిరుదంతో సత్కరించారు. ఆ విధంగా బ్రిటిష్ రాజదంపతులచే, గౌరవింపబడిన భారతీయులలో మొదటి వాడు కోడి రామమూర్తి నాయుడు. రామమూర్తి గారు ఫ్రాన్స్, జర్మని, స్పెయిన్ దేశాలలో పలు ప్రదర్శనలిచ్చారు.

స్పెయిన్ దేశంలో 'కోడె పోరాటం'(బుల్ ఫైట్)చాలా ప్రసిద్ధమైంది. ఈ పోరాటం చాల భీకరంగా ఉంటుంది. రామమూర్తిగారిని ఆ పోరులో పాల్గొనమన్నారు. అట్టి పోరాటంలో ఏలాటి అనుభవంలేని రామమూర్తిగారు 'సరే' అన్నారు. రామ మూర్తిగారు రంగంలో దూకారు. దూసుకుని వస్తున్న కోడె కొమ్ములను పట్టుకుని క్షణాల్లో క్రింద పడవేశారు. కోడెచిత్తుగా పడిపోయింది. వేలాది స్పానిష్ ప్రేక్షకుల హర్షధ్వానాలతో స్టేడియం మార్మోగింది.

జపాన్, చైనా, బర్మాలలో రామమూర్తిగారి ప్రదర్శనలు ఎంతో వైభవంగా సాగాయి.

బర్మాలో వున్నపుడు రంగూన్‌లో ప్రదర్శనలిచ్చారు. అసూయగ్రస్తులు కొందరు రామమూర్తిగారిని చంపాలనుకున్నారు. ఎలాగో ఈ విషయం గ్రహించిన రామమూర్తి గారు ప్రదర్శనను ఆపి మరుసటి రోజే మాతృదేశం వచ్చారు. కోడి రామమూర్తిగారు కోట్లు గడించారు. అంత కంటే గొప్పగా దాన ధర్మాలకు, జాతీయోద్యమాలకు ఖర్చు చేశారు.

భారతదేశం అంతటా రామమూర్తిగారి పేరు ప్రతిధ్వనించింది. అమెరికా వెళ్ళా లనుకున్నారు. కాని వెళ్లలేదు. ప్రతిరోజూ పత్రికల్లో రామమూర్తిగారి ప్రశంసలుండేవి.

రామమూర్తి నాయుడుగారు పండిత మదన మోహన మాలవ్యాగారి అతిథిగా ఏడాదీపాటు బెనారస్‌లో వున్నారు.

ఆయన శాకాహారి అని కొందరు అన్నారు ఆచార్య రోణంకి అప్పలస్వామిగారు,

రామమూర్తి గారి శిష్యుల నుండి సేకరించిన వివరాలనుబట్టి, రామమూర్తిగారు కోడిమాంసం సేవించేవారని తెలుస్తుంది.

భారతదేశంలో అతి విశిష్టమైన వ్యాయామ విద్యాసంస్థను ప్రారంభించాలనుకున్నారు. కాని ఆ ప్రయత్నం ఫలించలేదు.

కే.శే. మేడేపల్లి వరాహనరసింహస్వామిగారు రచించిన దానిని బట్టి రామమూర్తిగారు కాలిపై రాచపుండు లేచినందున కాలుతీసివేయవలసి వచ్చింది. సేకరించిన ధనం కరిగిపోయింది. శస్త్ర చికిత్స జరిగినప్పుడు ఎటువంటి మత్తుమందును (క్లోరోఫామ్)తీసుకోలేదు. ప్రాణాయామం చేసి నిబ్బరంగా వుండిపోయారు.

చివరిరోజులు బలంఘర్, పాట్నాలో కలవాండి (ఒరిస్సా) పరగణా ప్రభువు పోషణలో వుండి 16.1.1942తేదీన కన్ను మూశారు నాయుడుగారు.

తెలుగువారే కాక భారతీయులందరూ గర్వించదగిన మహనీయుడు, దేశభక్తుడు, 'కలియుగ భీమ'కోడిరామమూర్తి నాయుడుగారు.

వరవిక్రయం, మధుసేవ వంటి గొప్ప సాంఘిక నాటకాలను రచించిన, విఖ్యాత నాటక కర్త కాళ్ళకూరి నారాయణరావుగారు, కోడిరామమూర్తిగారి ఆప్త మిత్రులు. నాయుడుగారిని ప్రశంసిస్తూ "సాధు పథవర్తి సన్మిత్ర చక్రవర్తి రమ్యతరకీర్తి శ్రీ కోడి రామమూర్తి "అన్నారు.

### ఆంధ్రులకు గర్వకారణమైన

# 'ఆంధ్ర కేసరి' ప్రకాశం పంతులు



'దేశనాయక శిఖామణియై
తెలుగుజాతి ప్రకాశమ్మై
అవతరించిన ఆంధ్రకేసరి
అమరుడైన పురారి అతడు'

ఆంధ్ర ప్రజల ఆవేశానికి, అకుంఠిత ధైర్యసాహసాలకు, అసమానత్యాగ నిరతికి ప్రతినిధి ప్రకాశం పంతులు. అన్యాయాన్ని అక్రమాన్ని ఎదుర్కొనుటలో అతని కతడేసాటి. అతనివల్ల సహాయమందుకున్న వారే అతనికి ద్రోహం చేశారు. జాతీయ నాయకులు అతనిని సరిగా గౌరవించలేకపోయారు. ఎవరెన్ని విధాల వంచించినా ప్రజలను నమ్మి తన సర్వస్వాన్ని ధారపోసిన త్యాగమూర్తి ప్రకాశం. ప్రజలే ప్రకాశం ప్రకాశమే ప్రజలు అన్నమాటలో అతిశయోక్తి లేదు. ప్రకాశం తండ్రి గోపాలకృష్ణయ్య, తల్లి సుబ్బమ్మ. వీరి సంతానంగా 23.8.1872న ప్రకాశంగారి జననం. వల్లూరులో ప్రకాశంగారి ప్రాథమిక విద్య సాగింది. అ, ఆలు దిద్దుకుంటున్న వయసులోనే అల్లరితనానికి పేరు పొందాడు. గుండ్లకమ్మ ఈత, సాముగరిడీలు, రౌడీల సహవాసం, తాలింఖానాలో వ్యాయామం మున్నగువాటిలో దిట్టఅయ్యాడు.

బ్రతుకు తెరువు కోసం గోపాలకృష్ణయ్య కుటుంబంతో నాయుడుపేట చేరాడు. ప్రకాశంగారి పదకొండేళ్ళ ప్రాయంలోనే తండ్రి మరణించాడు. తల్లి సుబ్బమ్మ ఆరుగురు పిల్లలతో కొంతకాలం వినోదరాయుడు పాలెంలో అన్నగారింటవుండి, తన పిల్లలను విద్యావంతులుగ పెంచాలని ఒంగోలు చేరింది. పూటకూళ్ళ ఇల్లుపెట్టుకుని పిల్లలను చదివింపసాగింది. పూటకూటిల్లు పెట్టడం సాటివారిలో తలవంపులు, ఆత్మగౌరవానికి భంగం. అయినా తన పిల్లల పురోభివృద్ధికై, సాహసించి ముందంజవేసిన సాహస మాతృమూర్తి సుబ్బమ్మ.

1885లో ధార్వాడ నాటక కంపెనీ వారు ఒంగోలులో నాటకాలను ప్రదర్శించారు. నాటకాలంటే అమితమైన మోజుగల ప్రకాశం, రోజూ ఆ నాటకాలకు వెళ్ళేవాడు. మిషన్ హైస్కూల్ ఉపాధ్యాయులైన ఇమ్మానేని హనుమంతరావునాయుడు, ఉర్దూ భాషలో నాటకాలు వ్రాస్తున్న వుండవల్లి సాహెబ్‌గారికి ప్రకాశం అంటే ఎంతో ప్రేమ. నాయుడుగారు ప్రకాశంను కన్నబిడ్డలా చూచుకునే వారు. ప్రకాశం స్త్రీ పాత్రధారణలో మంచిపేరు సంపాదించారు.

తల్లి సంపాదన చాలినంతగా వుండేది కాదు. ప్రకాశం ధనవంతుల ఇళ్ళలో వారాలు చేసుకుని చదువుకునేవాడు. మిడిల్ స్కూల్ పబ్లిక్ పరీక్ష ఫీజు కట్టేందుకు మూడు రూపాయలు కూడా పుట్టని కాలమది. బావగారిని నమ్ముకుని పాతికమైళ్ళ దూరంలోని అద్దంకికి, పాదచారిగా వెళ్ళి ఒట్టిచేతులతో తిరిగి వచ్చాడు. తల్లితో తన బాధను చెప్పుకున్నాడు. దొడ్డతల్లి సుబ్బమ్మ తన పట్టుచీర తాకట్టుపెట్టి, పైకం యిచ్చింది. ఆసారి పరీక్షలో ప్రకాశం అందరికంటే మిన్నగా పాసైయ్యాడు.

హనుమంతరావు నాయుడుగారు ప్రకాశంకు జీతంలేకుండా చేయించాడు. మిషన్ హై స్కూల్‌లో ప్రి మెట్రిక్‌లో చేరాడు ప్రకాశం. నాయుడుగారి చలువవల్ల చదువు సాగింది. గొప్ప న్యాయవాది కావాలన్న పట్టుదల ప్రకాశంలో పెరిగింది. నాయుడుగారు ఒంగోలులో వచ్చు వేతనం చాలదని రాజమండ్రి వెళ్ళారు. అల్లరి ప్రకాశమును ఆంధ్రప్రకాశంగా రూపొందించిన మహనీయుడు నాయుడుగారు. రాజమండ్రిలో, ఎఫ్.ఎ. క్లాసులో చేర్పించారు. న్యాయశాస్త్రం చదవాలన్న కోరికను వెల్లడించాడు ప్రకాశం. తండ్రివంటి నాయుడుగారు, అప్పుచేసి ప్రకాశంను మద్రాసుకు పంపారు. మద్రాసు లా కాలేజీలో సెకండ్ గ్రేడ్ వకీలు పరీక్ష పాసై ఒంగోలులో ప్రాక్టీస్ ప్రారంభించాడు. మరల నాయుడుగారిపై ప్రేమకొద్దీ రాజమండ్రి చేరాడు. కొద్దికాలంలోనే రాజమండ్రిలోని న్యాయవాదులకు పక్కలో బల్లెమయినాడు ప్రకాశం.

ఆంధ్రప్రాంతంలో ఏర్పాటైన మొదటి పురపాలక సంఘం రాజమండ్రి, ఆ సంఘంలోని సభ్యులందరూ భూస్వాములు, ధనవంతులు ప్రసిద్ధ న్యాయవాదులు. ప్రకాశం ప్రతిభాపాటవాలు వారికి బాధ కల్గించాయి. పలుకుబడి గల ప్రముఖులందరినీ చిత్తుచేసి ప్రకాశం రాజమండ్రి నగరపాలక సంఘం అధ్యక్షుడయ్యాడు. అప్పటికాతని వయస్సు ముప్పది అయిదేళ్ళు. నగరపాలనాన్ని న్యాయంగా, నిర్భయంగా సాగించి ప్రజల మన్ననలందుకున్నాడు.

మిత్రుల ప్రోత్సాహంతో, బారిష్టర్ పట్టా సంపాదించాలన్న దీక్షతో లండన్ బయలు దేరాడు. మద్యం, మాంసం, మగువ– ముట్టుకోనని తల్లి యెదుట ప్రతిజ్ఞ చేశాడు. అక్కడ స్వయంగా వంటచేసుకుని, శాకాహారిగా వుండి విద్యాభ్యాసం పూర్తిచేశాడు. లండన్ లోని ఇండియా సొసైటీలో సభ్యుడుగా చేరాడు. దాదాభాయ్ నౌరోజీ బ్రిటిష్ పార్లమెంటు ఎన్నికలకు పోటీచేసినపుడు ప్రకాశం చాలా చురుకుగా నౌరోజీ విజయానికి కృషిచేశాడు. న్యాయవిద్యార్థిగా సర్టిఫికేట్ ఆఫ్ మెరిట్‌తోపాటు 50 పౌండ్ల బహుమతిని సంపాదించాడు.

బారిష్టర్ పట్టా పుచ్చుకున్న ప్రకాశం మద్రాసు లో ప్రాక్టీసు ప్రారంభించాడు. అప్పట్లో మద్రాసుహైకోర్టులో తమిళలాయర్లుగా భాష్యం అయ్యంగార్, కృష్ణస్వామి అయ్యర్ ప్రసిద్ధులు. ఆంగ్లేయులైన నార్టన్, గ్రాంట్ అను లాయర్లు బాగా పేరుగాంచినవారు.

తన చదువుకోసం 20వేల అప్పుచేసిన ప్రకాశం చక్కని గ్రంథాలయం ఏర్పరచు కుని, కొన్ని నెలల్లోనే హైకోర్టు వకీలుగా మంచిపేరుతో పాటు, సంపాదన కూడా సాధించాడు. దినసరి ఆదాయం వందల నుండి వేలకు పెరిగింది. ఆత్మవిశ్వాసం, నిరంతర పరిశ్రమ, నిర్భీకత ఆయనకు పెట్టనికోటలు. మద్రాసు నుండి వెలువ డుతూ వుండిన 'లాటైమ్స్' పత్రికలో వ్యాసం వ్రాస్తూ, న్యాయమూర్తి బౌద్ధికంగా అవినీతిపరుడు అని విమర్శించాడు. పదునాలుగేళ్ళు బారిష్టర్‌గా వుండి దాదాపు 15 లక్షలు సంపాదించాడు. బంధుమిత్రుల నెందరినో ఆదరించాడు. తనను బిడ్డలా పెంచిన నాయుడు గారి కుటుంబానికెన్నో విధాలుగా సహాయం చేశాడు. ఉదక మండలంలో రెండు బంగళాలు, మద్రాసులోని మాదాకోవెల వీధిలో రెండున్నర ఎకరాల విస్తీర్ణంగల బంగళా, రాజమండ్రిలో, ఒంగోలులో పెద్దభవనాలు, గోదావరి డెల్టా క్రింద సుక్షేత్రాలైన భూములు సంపాదించాడు. తమ్ముళ్ళు శ్రీరాములు, జానకిరామయ్యగార్లను బాగా చదివించాడు. శ్రీరాములుగారి కూతురే సినీనటి టంగుటూరి సూర్యకుమారి. భోగపురుషుడుగా ప్రసిద్ధుడయ్యాడు.

ప్రకాశంగారు జాతీయోద్యమం పట్ల ఆకర్షితులయ్యారు. అప్పటికి ఇంకా భారత రాజకీయ రంగంలో గాంధీజీ ప్రవేశింపలేదు.

1908లో ప్రముఖ జాతీయ నాయకుడు బిపిన్ చంద్రపాల్ మద్రాసుకు వచ్చాడు. అతని సభకు అధ్యక్షతవహించుటకు ప్రముఖులు భయపడినారు. పిడుగులు కురిసినట్లు, వడగండ్లవానలా చేసిన, బిపిన్‌పాల్ గంభీరోపన్యాసం మద్రాసు ప్రజల్లో నూతన చైతన్యం కల్గించింది. ఆనాటి నుండి ప్రకాశం తన జీవితాన్ని దేశసేవకు అంకితం చేయసాగాడు.

జాతీయ భావాలను ప్రచారం చేయటానికి, మద్రాసులో 'స్వరాజ్య' పత్రికను 1921 అక్టోబర్ 29న దినపత్రికగా ప్రారంభించారు. శ్రీయుతులు ఖాసా సుబ్బారావు, కోటంరాజు పున్నయ్య, జి.వి. కృపానిధి మున్నగు గొప్పపాత్రికేయులు 'స్వరాజ్య' లో పనిచేశారు. తమిళులు స్థాపించిన 'హిందూ'పత్రిక 'స్వరాజ్య'ను తొక్కివేసేందుకు

ఎన్నో ప్రయత్నాలు చేసింది. "స్వరాజ్య" పన్నెండేళ్ళు నడిచింది. లక్షల్లో అప్పులుచేశారు ప్రకాశంగారు. తన బంగళాలను అమ్మి అప్పులు తీర్చారు. ప్రభుత్వాన్ని నిశితంగా విమర్శించేవారాయన. "గాలితోనైనా పోట్లాడే స్వభావం కలవాడు ప్రకాశం"అన్నారు అయ్యదేవర కాళేశ్వరరావుగారు.

1929లో సైమన్ కమిషన్ మద్రాసుకు వచ్చింది. మద్రాసులో అతనిని బహిష్కరించటం వద్దన్నాడు గాంధీజీ. గాంధీగారి ఆదేశం ప్రకాశంగారికి నచ్చలేదు. రాజాజీ చల్లగా తప్పుకున్నాడు. ప్రకాశంపంతులు, దుర్గాబాయ్, రంగయ్యనాయుడు గార్లు, వేలాది ప్రజలతో వూరేగింపువెళ్తూ 'సైమన్ గోబ్యాక్' అని గర్జించారు. బ్రిటిష్ తొత్తులైన సైనికులు తుపాకులతో కాలుస్తాం అని కేకలు వేశారు. ఒక అజ్ఞాత దేశభక్తుడు తుపాకి గుళ్ళకు బలి అయ్యాడను వార్త దావానలంలా వ్యాపించింది. ప్రకాశం సింహంలా ముందుకురికాడు. చొక్కా గుండీలు విప్పి "రండిరా యిదె కాల్చుకొండిరా" అని గుండెలిచ్చి గండడైనిల్చాడు. తుపాకులు తలలువంచాయి. అంతటితో ప్రకాశం పేరు దేశమంతటా మార్మోగింది. 'ప్రమాదములున్న చోటనే ప్రకాశంగారుంటారు' అన్న పట్టాభిగారి మాటలు సత్యపూర్ణమైనవి.

ప్రకాశంగారు సత్యాగ్రహోద్యమంలో ముమ్మరంగా పాల్గొన్నారు. పలుమార్లు జైలుకు వెళ్ళారు. గాంధీజీని సైతం లెక్కచేయని ఆంధ్రనాయకులలో మొదటివారు ప్రకాశం. రెండవవారు గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు.

1937లో ఎన్నికలొచ్చాయి. సర్దార్‌పటేల్ గారి ఒత్తిడిపై మద్రాసునుండి కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేసిన ప్రకాశంగారు ఎన్నుకోబడ్డారు. రాజాజీ మంత్రివర్గంలో రెవిన్యూమంత్రిగా నియమింపబడ్డారు. ఆయన రెవిన్యూ మంత్రిగా చేసిన ఘనకార్యాలు ముఖ్యంగా:

రాయలసీమ కరువు కాలంలో స్వయంగా పర్యటించి కరువు పనులు ముమ్మరంగా ప్రారంభింపజేశారు.

పంటలు పాడైనప్పుడు ధారాళంగా శిస్తు రెమిషన్ యిప్పించారు.

శిస్తుభారంతో బాధపడుతున్న రైతులకు 75లక్షల శిస్తు ముజరా యిప్పించారు. రెండవ ప్రపంచ యుద్ధం రావటంతో కాంగ్రెస్ మంత్రివర్గం రాజీనామా చేసింది.

'క్విట్ ఇండియా' ఉద్యమంలో పాల్గొన్నందుకు జైలులో వుంచారు.

1945లో జైలు నుండి విడుదలైన తర్వాత రాష్ట్రమంతటా పర్యటించారు. ప్రజలాయనను ఎంతగానో ప్రేమించారు. మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి పదవిని చేపట్టి ప్రకాశంగారు ఫిర్కాడెవలప్‌మెంట్ స్కీమ్ ఉత్పత్తిదారుల వినియోగదారుల సహకార సంఘాలు నెలకొల్పారు. గాంధీజీ, రాజాజీ వంటి నాయకులు ప్రకాశంగారికి వ్యతిరేకంగా కుట్రచేశారు. ప్రకాశం ప్రభుత్వం పడిపోయింది. కాంగ్రెసును వదలి ప్రజాపార్టీ స్థాపించారు.

పొట్టి శ్రీరాములు ఆత్మార్పణతో 1953అక్టోబర్ 1వ తేదీన ఆంధ్రరాష్ట్రం

అవతరించింది. ఆంధ్రనాయకుడైన ప్రకాశం ముఖ్యమంత్రిగా కర్నూలు రాజధానిగ ఆంధ్ర ప్రజల కోర్కె ఫలించింది. ప్రకాశంగారు గుంటూరులో హైకోర్టు, తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం నెలకొల్పారు. కేంద్రప్రభుత్వం మంజూరు కోసం వేచి వుండక కృష్ణాబ్యారేజి నిర్మింపచేశారు. కాని ఏడాదిలోపే ఆయనపై అవిశ్వాసతీర్మానం పెట్టారు. పదవి పోయినా ప్రజలాయనను మహారాజుగా గౌరవించారు.

ప్రకాశం మహాసాహసి. రోమన్ సేనాపతిలా అచంచలమైన పట్టుదలగల మొనగాడు. కష్టసుఖాలను సమభావంతో చూచిన స్థితప్రజ్ఞుడు. కృషియే పరమాత్ముని పూజగా భావించినవాడు.

ప్రకాశం లక్షలార్జించినా, చివరికో చిల్లిగవ్వను సైతం దాచుకోలేదు. చరమ దశలో రాష్ట్ర ప్రభుత్వంవారు ప్రకాశంగారికి నెలకు రు.750/– గౌరవభృతి, సొంతవుపయోగానికి ఒక కారు యిచ్చారు.

ఆంధ్రజాతికి తిరుగులేని నాయకుడుగా వెలిగిన ప్రకాశం వీరుడైన భీష్మునిలా మరణించారు. 1957 మేనెల 20వ తేదీన ఆయన దివంగతులయ్యారు.

*"భవ్య గుణముల దివ్యఖనియై
భారతాంబకు ముద్దుబిడ్డయై
గాఢమైన స్వరాజ్యకాంక్షల
గండుమీరిన శూరుడాతడు
సరిసములు లేనట్టి యాతడు
ప్రజలకున్ దేశాభిమానము
పంచిపెట్టిన నేతయాతడు"*

## తెల్లదొరలను గజ గజలాడించిన రేనాటి వీరుడు

# ఉయ్యాలవాడ నరసింహారెడ్డి

"అదుగో వచ్చే, ఇదుగో వచ్చే నరసింహారెడ్డి
పళపళ పళపళ కేకవేసెరా నరసింహారెడ్డి
చంద్రాయుధమూ చేతబట్టెనే నరసింహారెడ్డి
..................................................................
ఆవుల మందలో పులి దుమికిన చందము దుమికినడూ
..................................................................
కరువు వచ్చినా కాలమొచ్చినా ఆదరించే రెడ్డీ
అట్టివక్క మన రెడ్డిమాటనూ చిన్న చెయ్యరాదూ
నాలుగు గ్రామాల మందిగా తాము లేచినారు."

1857 నాటి మొదటి భారత స్వాతంత్ర్యయుద్ధానికి పదేళ్ళముందే బ్రిటిష్ దుష్టపాలనపై తిరుగుబాటుజెండా రెపరెపలాడించిన స్వాతంత్ర్యవీరుడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి.

విజయనగర రాజులు తళ్ళికోట యుద్ధంలో బహమని సుల్తానుల చేతిలో ఓడిపోయారు. సామంతులుగా వుండిన పాళెగాళ్ళు తమ కత్తికి అడ్డం లేకుండా నియంతల వలె వ్యవహరింపసాగారు. రాజులమని గొప్పగా విర్రవీగేవారు.

1799లో టిప్పుసుల్తాన్ ఆంగ్లేయుల చేతుల్లో ఓడిపోయాడు. అప్పుడు రాయలసీమ నైజాం వశంలో వుండేది. నైజాం నవాబు రాయలసీమ జిల్లాలను బ్రిటిష్ వారికి అప్పగించాడు. పాళె గాళ్ళు బ్రిటిష్ వారి పాలనలోకి వచ్చారు. కడపజిల్లాలో ఆనాడు 80మంది పాళెగాళ్ళుండేవారు. వీరు ప్రజలను పీడించి పన్నులు వసూలు చేసేవారు. దత్తమండలానికి మొట్టమొదటి కలెక్టర్ సర్ థామస్ మన్రో. పాళెగాళ్ళ పారంపర్య హక్కులను రద్దుచేసాడు. వారికి నెలసరి పింఛన్ ఏర్పాటు చేశాడు.

ఈనాటి కర్నూలు జిల్లాలోని ఉయ్యాలవాడ పాళెగాడు పెద్దమల్లారెడ్డి. అతని ముగ్గురు కొడుకుల్లో చివరివాడు నరసింహారెడ్డి. కోయిలకుంట్ల తాలూకా లోని ఉయ్యాలవాడ జాగీర్‌ను ఆంగ్లేయులు వశం చేసుకొనేనాటికి ఆ జాగీర్ నుండి 30 వేల రూపాయలకు పైగా రెవిన్యూ రాబడి వుండేది. జాగీర్‌ను వశం చేసుకున్న తెల్లదొరలు పెద్దమల్లారెడ్డి కుటుంబానికి నెలకు రు.70 పింఛన్ ఏర్పాటు చేశారు. అందులో పెద్ద మల్లారెడ్డి తమ్ముడు చిన మల్లారెడ్డికి సగంపోగా మిగతా సగం 35 రూపాయల్లో నరసింహారెడ్డికి మూడోవంతుగా 11 రూపాయలు 10 అణాలు 8 పైసలు పింఛన్ వచ్చేది. నరసింహారెడ్డి మాతామహుడైన (తల్లి తండ్రి) నొస్సం జమీందార్ జయరామరెడ్డికి ఏటా 22 వేల రూపాయల రెవిన్యూ వచ్చే జాగీర్‌ను వశం చేసుకుని

నెలకు వేయి రూపాయల పింఛన్ ఏర్పాటు చేశారు. నొస్సం జమీందార్ నిస్సంతుగా మరణించడంతో పింఛన్ మొత్తం ఆపివేయబడింది.

తెల్లదొరలు క్రమంగా కట్టుబడి మాన్యాల వంశ పారంపర్య హక్కును రద్దు చేసి మాన్యాలను స్వాధీనం చేసుకోవటంతో కట్టుబడి బంట్రోతుల్లో అసంతృప్తి చెలరేగింది.

1846 జూన్ నెలలో తనకు రావలసిన మేనెల పింఛన్ పైకం కోసం, చీటి వ్రాసి కోయిలకుంట్ల ట్రెజరీకి మనిషిని పంపాడు నరసింహారెడ్డి. అది వరకు, పైకం పంపుతున్న తాసిల్దార్ ఈసారి వచ్చిన మనిషిని తిట్టి, నరసింహారెడ్డివస్తేకాని పింఛన్ పైకం యివ్వనన్నాడు. రెడ్డి ఉదాసీనంగా వుండటం గమనించిన తహసీల్దార్ వారంట్ యిచ్చి బంట్రోతులను పంపాడు. వచ్చిన వాళ్ళను తన్ని తరిమివేశాడు నరసింహారెడ్డి. ఈ విధంగా పోరాటం ఆరంభమైందంటారు.

మాన్యాలు పోగొట్టుకున్న కట్టుబడిదార్లు కొండజాతుల వాళ్ళు నరసింహారెడ్డిని ఆశ్రయించారు. నరసింహారెడ్డి నాయకత్వంలో దాదాపు 9 వేల మంది చేరారు. వనపర్తి, మునగాల, జటప్రోలు జమీందార్లు పెనుగొండ, ఔకు, జమీందార్లు, హైదరాబాద్‌కు చెందిన సలాం ఖాన్, కర్నూలుకు చెందిన పాపాఖాన్, బనగానపల్లె నవాబ్ మహమ్మద్ అలీఖాన్, కొందరు బోయలు, చెంచులు, బ్రాహ్మణులు కూడా నరసింహారెడ్డి సైన్యంలో చేరారు. కంపెనీ ప్రభుత్వం నరసింహారెడ్డిపై నిఘా పెట్టింది.

1846 జూలైలో (7,8 తేదీలు కావచ్చు) నరసింహారెడ్డి 9 వేల మంది అనుచరులతో చాగలమర్రి తాలూకా రుద్రవరం గ్రామంపై దాడి చేశాడు. మిట్టపల్లి వద్ద పోలీసులు వారిని అటకాయించారు. ఈ పోరాటంలో ఒక దఫేదారు తొమ్మిదిమంది బంట్రోతులు మరణించారు.

నరసింహారెడ్డి బృందం మరుసటి దినం కోయిలకుంట్ల ట్రెజరి పైబడి ఆనాడు ఖజానాలో వున్న, ఎనిమిది వందల అయిదు రూపాయలు పది అణాల నాలుగు పైసల మొత్తాన్ని దోచుకున్నారు. తహసీల్దారు రాఘవాచారిని నరసింహారెడ్డి మనుషులు బందీగా పట్టుకున్నారు. ఖజానా సిబ్బందిని అయిదుగురిని చంపివేశారు.నరసింహారెడ్డిని పట్టుకునేందుకు పోలీసులకు సహాయంగా సైన్యాన్ని పిలిపించమని కలెక్టర్ కడపలోని కమాండింగ్ ఆఫీసరును కోరాడు. కర్నూలునుండి గుర్రపు దళాన్ని పిలిపించాడు. నరసింహారెడ్డి, ప్రొద్దుటూరు సమీపంలోని దువ్వూరు ఖజానాను, చుట్టుపట్ల గ్రామాలను దోచుకున్నాడు. అప్పటికే సైన్యం జమ్మలమడుగు చేరుకున్నది. నరసింహారెడ్డి తన బృందంతో అహోబిలంలోని కోట చేరుకున్నాడు. నరసింహారెడ్డి ఆచూకీ తీయటం ప్రభుత్వానికి కష్టమైంది. కంభం తహసీల్దారును వెంటపెట్టుకుని కడప నుండి కెప్టెన్ నాట్ పెద్దసైన్యంతో బయలుదేరాడు. జె.ఎచ్. కొక్రేన్ మరో సైనిక దళంతో రుద్రవరం వద్ద, నాట్‌ను కలుసుకునే ఏర్పాటు చేశాడు. తిరుగుబాటు దళం గుత్తి కనుమ మీదుగా ముండ్లపాడు చేరుకుంది. అక్కడికి మూడు మైళ్ళ దూరంలోని కొత్తకోటలోని పాడుపడిన కోట, నరసింహారెడ్డికి కార్యాలయం అయింది. నరసింహారెడ్డి

ప్రతి కనుమ దగ్గర కొంత కట్టుబడి సిబ్బందిని కాపలా వుంచాడు.

నరసింహారెడ్డి 5వేల బలగంతో పాట్సన్‌ను గిద్దలూరు వద్ద అడ్డుకున్నాడు. పాట్సన్ వద్ద వున్న సైనికులు వందమందే. ఆరు గంటలసేపు నరసింహారెడ్డి మనుషులకు, పాట్సన్ సైన్యానికి భీకరమైన పోరాటం జరిగింది. నరసింహారెడ్డి మనుషులు 200 మంది మరణించారు. చీకటి పడటంతో యిరుపక్షాల వారు తమదారిన తాము వెళ్ళిపోయారు.

కొండలలోని కాలిబాటలు అడ్డదారులు సైనికులకు పరిచయం లేవు. నరసింహారెడ్డి మనుషుల కోసం సైన్యం కొండలన్నీ గాలించింది. గ్రామాధికార్ల మీద, కట్టుబడిదార్ల మీద కేసులు మోపారు.

నరసింహారెడ్డి పాళెగాణ్ణి పట్టిస్తే వేయి రూపాయలు, అతని ముఖ్య సలహాదారు గోసాయి వెంకన్నను పట్టిస్తే వంద రూపాయల బహుమానాన్ని యిస్తామని ప్రభుత్వం ప్రకటించింది.

నరసింహారెడ్డి తన కుటుంబాన్ని కొత్త కోటకు తరలించాడు. ప్రభుత్వ సైనికులు ఆ ప్రాంతంపై దాడి జరిపినపుడు హైదరాబాద్ రాజ్యంలోని ప్రాతకూరు జమీందారు లాల్‌ఖాన్‌కు, నరసింహారెడ్డి మధ్య జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలు పట్టుకున్నారు. ఆ పత్రాలు విచారణలో ప్రభుత్వానికి బలమైన సాక్ష్యాలయ్యాయి.

నరసింహారెడ్డికి ముగ్గురు భార్యల ద్వారా ఇద్దరు కుమారులు, ముగ్గురు కూతుళ్ళూ ఉండేవారు. నరసింహారెడ్డి కుటుంబాన్ని పట్టుకుని ప్రభుత్వం, వారిని కడపలోని ఒక బంగాళాలో వుంచారు. మెరుపుదాడి చేసి కుటుంబ సభ్యులను విడిపించాలని కొండల మీదుగా ప్రయాణం చేసి కడప చేరాడు నరసింహారెడ్డి.

1846 అక్టోబర్ 6వ తేదీన ఎర్రమల నలమల కొండల మధ్య నున్న పేరుసామల లోని జగన్నాథాలయంలో రెడ్డి ఉన్నాడని తెలుసుకున్న కలెక్టర్ కాక్రేన్ నలుదిక్కులా సైన్యాన్ని మోహరించి 40, 50 మంది నరసింహారెడ్డి మనుషులను కాల్చి చంపారు. వందమంది దాకా గాయపడ్డారు. కాలికి గుండు దెబ్బ తగలడంతో రెడ్డి ఫిరంగి దళాలకు పట్టుబడినాడు.

నరసింహారెడ్డితో పాటు 901 మందిపై కేసు పెట్టారు. వీరిలో 412 మందిపై నేరం రుజువు కాలేదు. 273 మందిని పూచీకత్తుపై వదలి పెట్టారు. 112 మందికి 14 నుంచి 5 ఏళ్ళ దాకా శిక్షలు పడ్డాయి. కొందరికి ద్వీపాంతరవాస శిక్ష పడింది. వారిలో ఔకు రాజు తమ్ముడొకడు.

కడప స్పెషల్ కమిషనర్ కేసు విచారణ జరిపి, నరసింహారెడ్డి ప్రభుత్వంపై తిరుగుబాటు చేయడమే కాక, హత్యలకు, దోపిడీలకు, పాల్పడినట్లు తీర్పు చెబుతూ, ఉరిశిక్ష విధించాడు. అది మామూలు శిక్ష కాదు. ఉరి తర్వాత అతని శిరస్సును కోయిలకుంట్ల దగ్గర బురుజుపై గొలుసులతో బంధించి తూకుమానుకు వేలాడ దీయవల్సిందిగా తీర్పు.

1827 ఫిబ్రవరి 22 న ఫలానాచోట ఉదయం 7 గంటలకు నరసింహారెడ్డిని

ఉరితీస్తారని ప్రభుత్వం వూరూరా చాటింపు చేయించింది. కాక్రేన్ ఎదుట ఉరితీశారు.

ఆ విషాదదృశ్యాన్ని 2 వేల మంది ప్రజలు కన్నీళ్ళు రాలుస్తూ చూచారు. వారి నోళ్ళకు బీగాలు పడ్డాయి. నరసింహారెడ్డి ప్రాణం ఉరికంబం మీద అనంత వాయువుల్లో కలిసే వరకు అతని ముఖం ప్రశాంత గంభీరంగా వుండినది.

చుట్టుప్రక్కల వారికి హెచ్చరికగా వుండాలంటూ నరసింహారెడ్డి శిరస్సును రెండు మూడు తరాల వరకు ఆ బురుజుపై వేలాడేటట్లు చేశారు ఆనాటి కిరాతకులైన తెల్లదొరలు. నరసింహారెడ్డి వంటి త్యాగమూర్తుల బలిదాన ఫలం యీనాడు మనం అనుభవిస్తున్న స్వాతంత్ర్యం .

జానపదులు ఆ స్వాతంత్ర్య వీరుని అమరగాథను పాడుతూ మనలను ఉత్తేజపరుస్తున్నారీనాటికీ.

*"దొరవారి నరసింహారెడ్డి*
*నీ దొర తనము కూలిపోయె రాజా*
*నరసింహారెడ్డి*
*రేనాటిసీమలో రెడ్డోళ్ళ కులములోనా*
*దొరవారి వమిశానా ధీరుడే నరసింహారెడ్డి*
*కోయిల్ కుంట్లా గుట్టలెంటా కుందేరు వొడ్డులెంటా*
*గుఱ్ఱమెక్కి నీవు వస్తే కుంపిణీకి గుండెదిగులూ*
*కాలికి సంకెళ్ళు వేసి చేతికి బేడీలు వేసి*
*పారాతో పట్టి తెచ్చి బంధికానులో పెట్టిరీ*
*కండ్లకూ గంతలూ గట్టే నోటి నిండా బట్లు పెట్టి*
*నిలువునా నీ తల్లికేమో చావు సుద్దీ తెలిసినాదీ*
*కన్నకడుపే తల్లడించే గంగలోనా గంగ గలిసే*
*దొరవారి నరసింహారెడ్డి*
*నీ దొరతనము కూలిపోయె రాజా నరసింహారెడ్డి"*

బహుముఖ ప్రజ్ఞానిధి

# సురవరం ప్రతాపరెడ్డి



"ఓ నిజాము పిశాచమా, కానరాడు
నిన్ను బోలిన రాజు మాకెన్నడేని
తీగలను తెంపి అగ్నిలో దింపినావు
నా తెలంగాణ కోటి రత్నాల వీణ "
- దాశరథి

కనీసమైన మానవ హక్కులు లేక, నవాబు, నిరంకుశత్వంలో అలమటిస్తున్న తెలంగాణా ప్రజానీకాన్ని చైతన్యవంతంగా తీర్చిదిద్దిన తెలంగాణ వైతాళికులు ముగ్గురు మనకు సదాస్మరణీయులు.

వారు కొమర్రాజు లక్ష్మణరావుగారు, మాడపాటి హనుమంతరావుగారు, సురవరం ప్రతాపరెడ్డిగారు. చీకటిలో కొట్టుమిట్టాడుతున్న తెలుగు వారికి ముఖ్యంగా తెలంగాణాకు వెలుగును పంచిన మహనీయులలో ఎన్నదగినవారు సురవరం ప్రతాపరెడ్డిగారు.

ప్రతాపరెడ్డిగారు 1896 మే 28వ తేదీన గద్వాల సంస్థానంలోని 'బోరవెల్లి' అను గ్రామంలో తమ అమ్మమ్మగారి ఇంట్లో జన్మించారు. వారి స్వగ్రామం మహబూబ్ నగర్ జిల్లా అలంపురం. తాలూకాలోని 'ఇటికలపాడు' తల్లి రంగమ్మ. తండ్రి నారాయణ రెడ్డిగారు. దాతగా విద్యాభిమానిగా పేరుగాంచిన పిన తండ్రి రామకృష్ణారెడ్డిగారి

వద్ద కర్నూలులో ప్రాథమిక విద్యాభ్యాసం చేశారు. వెల్లాల శంకరశాస్త్రిగారి వద్ద సంస్కృతకావ్యాలు, వ్యాకరణం చదువుకొన్నారు. నిజాం కాలేజిలో ఎఫ్.ఎ. మద్రాసు ప్రెసిడెన్సి కాలేజిలో బి.ఏ. చదివిన తర్వాత బి.ఎల్. చదివి న్యాయవాద వృత్తిని చేపట్టారు. కాని వారు ఎంతో కాలం ఆ వృత్తిలో ఉండలేకపోయారు.

భారత దేశంలో గాంధీజీ నాయకత్వంలో సాగుతున్న స్వాతంత్ర్యపోరాటం వారిని ఆకర్షించింది. తెలంగాణా ప్రజల దైన్యం, దారిద్ర్యం, ప్రాథమిక హక్కులను కూడా నోచుకోని దుస్థితి చూచి చలించి పోయారు ప్రతాపరెడ్డిగారు. మాతృభాషలో చదువుకొనే అవకాశాలు లేవు. అంతా ఉర్దూమయం. నిజాం నిరంకుశ పరిపాలన. నిద్రాణమైన తెలంగాణాను జాగృతం చేయాలని దీక్ష వహించారు రెడ్డిగారు.

ఆనాటి నైజాంలో తెలుగు భాషకు, సంస్కృతికి పట్టుగొమ్మగా ఉండిన వారు రాజా బహదూర్ పింగళి వెంకటరామారెడ్డిగారు. ప్రతాపరెడ్డి గారిని వారు 1924 లో హైదరాబాద్‌లోని రెడ్డి హాస్టల్ కార్యదర్శిగా నియమించారు. వెంకటరామారెడ్డి గారు కొత్వాలు (నేటి పోలీస్ కమిషనర్)గా ఉండేవారు. ప్రతాపరెడ్డిగారు హాస్టల్ విద్యార్థులలో క్రమశిక్షణను నెలకొల్పివారిని చైతన్య వంతులను కావించారు. పేరుకు రెడ్డి హాస్టల్. కాని అన్ని కులాల వారికి ప్రవేశం ఉండేది. ఆ హాస్టల్‌లో విలువైన పుస్తకాలతో చక్కని గ్రంథాలయాన్ని ప్రారంభించారు.

హైదరాబాద్ సంస్థానంలోని తెలుగు ప్రజల విజ్ఞానానికి తెలుగులో పత్రికను ప్రారంభించాలని నిశ్చయించారు. హాస్టల్ కార్యదర్శి పదవిని మానుకొన్నారు. రాజా బహదూర్‌గారి ఆశీస్సులతో 1926 మే 10వ తేదిన 'గోలకొండ' పత్రికను ప్రారంభించారు. ఆ పత్రిక వారానికి రెండు మార్లు వెలువడుతుండేది.

పత్రికలోని ఒక సంపాదకీయంలో "మేము మా పత్రికాస్థాపన కాలం నుండి రెండు అంశాలను దృష్టిపథంలో ఉంచుకొని దేశీయుల సేవ చేస్తున్నాము. మొదటిది ఆంధ్ర భాషా సేవ, రెండవది జాతి, కుల విపక్షత లేక నిష్పక్షపాతముగా ఆంధ్రులలో సర్వశాఖల వారి యొక్క సత్వరాభివృద్ధికి పాటుపడుట"అని వ్రాసి పత్రిక ఆశయాలను వెల్లడించారు. పత్రికా నిర్వహణలో ఎన్నో కష్టాలను ఎదుర్కొన్నారు. జాతీయ భావాలను ధైర్యంగా ప్రచారం చేశారు.1947 ప్రాంతంలో అది దిన పత్రికగా మారింది. పోలీస్ చర్య వరకు ప్రతాపరెడ్డిగారు 'గోలకొండ' పత్రికా సంపాదకులుగా పనిచేశారు. వారి తర్వాత నూకల నరోత్తమ రెడ్డిగారు, రాజా రామేశ్వరరావు గారు కొన్నేళ్ళు పత్రికను నిర్వహించారు. 1966దాకా పత్రిక నడిచింది. కొంతకాలం దేవులపల్లి రామానుజరావుగారు కూడా సంపాదకులుగ పనిచేశారు.

ప్రతాపరెడ్డిగారు సంస్కృతం, తెలుగు, ఉర్దు, ఆంగ్ల భాషలలో గొప్ప పండితులు. కాశీనాథుని నాగేశ్వరరావుగారు, తెలుగు దేశంలో మొట్టమొదటి రాజకీయ ఖైదీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు సురవరం వారికి సన్నిహితులు. ఆ కాలంలో సభలు సమావేశాలు జరుపుకొనటం చాలా కష్టం. ఆ పరిస్థితిని 'వాగ్బంధన శాసన శృంగార తాండవ విశేషం' అన్నారు ప్రతాపరెడ్డిగారు.

1951 లో ప్రతాపరెడ్డిగారు, పులిజాల హనుమంతరావుగారితో కలిసి 'ప్రజావాణి'దిన పత్రికను స్థాపించి రెండేళ్ళు నడిపారు.

ఆంధ్రుల చరిత్ర మరియు సంస్కృతిపట్ల వారికి ప్రగాఢమైన అభిమానం ఉండేది. ప్రజలలో విజ్ఞాన వికాసానికి గొప్ప రచనలు చేశారు. గొప్ప పరిశోధకులుగా, కవిగా, నవలా రచయితగా, కథారచయితగా, సాహిత్య విమర్శకులుగా వారు సుప్రసిద్ధులు. తెలంగాణా ప్రజల భాషనుకాని, వారి సంస్కృతినిగాని తక్కువ చేసి మాట్లాడితే సహించేవారు కాదు.

"బ్రిటిష్ ఆంధ్రులు బ్రౌణ్యాంధ్రం (ఇంగ్లీష్ తెలుగు)మాట్లాడితే మేము తార క్యాంధ్రం (ఉర్దు తెలుగు) మాట్లాడుతాము. వారిది ఇంగ్లీష్ దడదడ, మాది ఉర్దు గడబిడ "అనేవారు

ముడుంబ వెంకట రాఘవాచార్యులు అను వ్యక్తి తెలంగాణాలో కవులులేరన్నారట. ప్రతాపరెడ్డిగారు వారికి తగిన సమాధానం చెప్ప నిశ్చయించి నాలుగు నెలల్లో 354 కవుల జాబితా, వివరాలలో 'గోల్కొండ కవులు' అను గొప్ప సంచికను ప్రచురించారు. అది వారి పట్టుదల.

సురవరం వారు దాదాపు 40 గ్రంథాలు రచించారు. నిజాం రాష్ట్ర పాలనము, మొగలాయి కథలు, సంఘోద్ధరణము, ఉచ్చల విషాదము, గ్రంథాలయము, హిందువుల పండుగలు, హైందవ ధర్మవీరులు, యువజన విజ్ఞానం మున్నగు గ్రంథాలను రచించారు. వారి రచనలలో ప్రధానంగా పేర్కొనదగినవి రామాయణ విశేషములు, ఆంధ్రుల సాంఘిక చరిత్ర. దక్షిణ భారతదేశంలో సాంఘిక చరిత్ర వ్రాసిన వారిలో మొదటివారు సురవరం వారే.

'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'లో వెయ్యి సంవత్సరాల చిత్ర సంగ్రహం ఉంది. అందలి విశేషాలను, డా. ఎన్. గోపి, ఉదహరిస్తూ 'పరిశోధన '(సంచిక – 4)లో పేర్కొన్న ముఖ్యాంశాలివి.

1. నన్నయ తిక్కనల కాలంలో పురుషులు కూడా మట్టెలు ధరించేవారు.
2. తెలుగు వర్ణమాలను, ఓనమాలు అనటం శైవ సంప్రదాయం నుండే వచ్చిందని (ఓం నమః శివాయ) గుర్తించారు.
3. రెడ్లు, వెలమలు తెలుగువారు కారనీ ఉత్తరాది నుంచి వచ్చిన రాష్ట్ర కూటులు రెడ్లయినారని, తమిళదేశం నుండి వచ్చిన వెల్లాలు వెలమలైనారని, ప్రతాపరెడ్డిగారు పేర్కొన్నారు. వెలమలు సంఘ సంస్కరణాభిలాషులనీ, రెడ్లు పూర్వాచారపరాయణులనీ, ఈ రెండు తెగల మధ్య ఎప్పుడూ స్పర్థ ఉండేదని, శ్రీనాథుని కాలంలో ఇద్దరూ సమానులుగా పరిగణింపబడ్డారనీ వివరించారు.
4. విజయనగర కాలంలో మాన్యాలు మిరాశీలు ఏర్పడ్డాయి. గ్రామ వ్యవస్థలో 12 విధాల ఆయగాండ్లు ఏర్పడ్డారు. పోర్చుగీసు వారితో వ్యాపారం ప్రారంభమైంది. ఫ్రెంచి, ఇంగ్లీషువారు కూడా వ్యాపారార్థం రావటం ప్రారంభమైంది.

5. క్రమంగా గ్రామవ్యవస్థలో మార్పులు తటస్థించి పంచాయితీ సభలు ఏర్పడ్డాయి. ఏడాదికో గ్రామ పెద్దను ఎన్నుకోవటం ప్రారంభమైంది.
6. అరణ్యాలను కొట్టి భూములను సేద్యానికివ్వడం. సమిష్టి సేద్యం మొదలైనవి ఆనాటి వ్యవసాయ పద్ధతులు. భూముల కొలతలు, బార, మూర, గద, కుంట అని ఉండేవి.
7. విజయనగర కాలం నాటికే ఇస్లాం ఇక్కడ వేళ్ళూనింది. హిందువుల బౌద్ధుల పతనం అత్యంత లజ్జాకరమైంది. యుద్ధతంత్రంలో ముస్లింలు హిందువుల కన్నా నిస్సందేహంగా నిపుణులు. రెడ్డి, వెలమ, విజయనగరరాజులు ప్రతిఘటించినంత కాలం తెలుగు ప్రాంతం ముస్లింలకు లొంగ లేదు. విజయనగర పతనంతో ఆంధ్రుల పతనం పూర్తి అయింది. తురక, క్రైస్తవాల ప్రాబల్యం నుండి ఆంధ్ర దేశాన్ని రక్షించింది రాజులుకారనీ ఆ నాటి తత్త్వవేత్తలని ప్రతాపరెడ్డిగారు అభిప్రాయపడ్డారు. వారిలో ముఖ్యులు వేమన, వీర బ్రహ్మం.
8. శ్రీనాథుడు వర్ణించిన కన్నడ దేశాన్ని ఆనాటి కర్ణాటక భాగమైన రాయలసీమగా భావించారు రెడ్డిగారు. పన్నులు వసూలు చేయుటలో శ్రీనాథ కవిని హింసించిన పద్ధతులు హైదరాబాద్ రాజ్యంలో 1900 వరకు ఉండేవన్నారు సురవరం వారు.

తెలంగాణా రాజకీయ చరిత్రలో ప్రతాపరెడ్డిగారు ప్రముఖ పాత్ర వహించారు. 1927లో ఏర్పడిన ఏకైక ప్రజాసంస్థ అయిన ఆంధ్ర మహాసభ యొక్క ప్రథమ మహాసభకు అధ్యక్షత వహించారు. వారి సేవలు అందుకొనని సంస్థ తెలంగాణాలో ఏ ఒక్కటి లేదు.

ఆంధ్ర సారస్వత పరిషత్ అధ్యక్షులుగా పనిచేశారు. శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం, వేమన ఆంధ్ర భాషా నిలయం, హిందీ ప్రచారసభ మున్నగు సంస్థల ప్రగతికి ఎంతో కృషి చేశారు.

రెడ్డిగారి మిత్రులైన గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు కర్నూలు నుండి శాసనసభకు పోటీచేయమని కోరగా రెడ్డిగారు తిరస్కరించారు. కాని పోలీస్‌చర్య అనంతరం 1952 లో జరిగిన శాసన సభ ఎన్నికల్లో, మిత్రుల ఒత్తిడిపై వనపర్తి నియోజకవర్గం నుండి కాంగ్రెస్ పక్షాన పోటీచేసి విజయం సాధించారు. కాని రాజకీయాలు వారి కంతగా రుచించలేదు.

సురవరం వారు రచించిన 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'కు కేంద్ర సాహిత్య అకాడమి అవార్డు లభించింది.

త్యాగము, దేశభక్తి, భాషాభిమానం, ప్రజా శ్రేయస్సు పరమార్థంగా జీవించిన సురవరం ప్రతాపరెడ్డిగారు 1953 ఆగష్టు 25న దివంగతులయ్యారు.

వైద్యరంగంలో ధృవతార

# యల్లాప్రగడ సుబ్బారావు



తమ్ముడు పదిరోజులుగా బాధపడుతున్నాడు. రక్తహీనత వల్ల నానాటికీ కృషిస్తున్నాడు. పలుమార్లు విరేచనాలవుతున్నాయి. వ్యాధి మరింత తీవ్రమైంది. తమ్ముని బాధను చూస్తూ నిస్సహాయుడై నిల్చున్నాడు అన్న. పెద్ద వైద్యం చేయించేందుకు డబ్బుల్లేని వాడా బాలుని తండ్రి. చూస్తున్నట్లే తమ్ముడు శాశ్వతంగా కన్నుమూశాడు. పన్నెండేళ్ళ అన్న కన్నీరు కారుస్తూ 'ఈ రోగానికి మందేలేదా?' అని తనలో తాను ప్రశ్నించుకున్నాడు.

భయంకరమైన ఈ వ్యాధిని నిర్మూలించాలి. ఇందుకు మందు కనిపెట్టాలి. నేను డాక్టర్ కావాలి అని నిశ్చయించుకొన్నాడు ఆ బాలుడు. ఆ బాలుడే దీక్ష, నిరంతర శ్రమ, పరిశోధనలవల్ల గొప్ప వైద్యశాస్త్ర వేత్తగా ప్రపంచ ప్రజల మన్నన లందుకున్న డా. యల్లాప్రగడ సుబ్బారావు

యల్లాప్రగడ సుబ్బారావుగారు 1.7.1896న రాజమహేంద్రవరంలో జన్మించారు. తండ్రి తాలూకా కచ్చేరిలో గుమాస్తా. వారిది పేద కుటుంబం. అందుకుతోడు బాల్యంలోనే తండ్రిని కోల్పోయారు సుబ్బారావుగారు. బాల్యం నుండి దైవచింతన కలవాడాయన. రామకృష్ణమఠం వారి సహకారంతో మద్రాసు మెడికల్ కాలేజి నుండి

పట్టభద్రులైనారు. విద్యార్థి వేతనం లభించినందున, లండన్ వెళ్ళి ట్రాపికల్ స్కూల్ ఆఫ్ మెడిసిన్ నుండి డిప్లొమా ,అందుకున్నారు. 1923లో మల్లాది సత్యలింగనాయకర్ ధర్మ సంస్థ సహాయంతో అమెరికా వెళ్ళారు. హార్వర్డ్ స్కూల్ ఆఫ్ ట్రాపికల్ మెడిసిన్ సంస్థలో లైబ్రేరియన్ గా చేరారు. జీవ రసాయన శాస్త్రంలో అభిరుచి పెరగటంతో డాక్టర్ ఓటోఫోలిన్ అను ఆచార్యుని నేతృత్వంలో పరిశోధన సాగించి పి.హెచ్.డి. పట్టాపొందారు. విరామము దొరికినపుడల్లా వైద్యశాలలో ఆర్డర్లీగా పనిచేస్తూ, తన చదువుకు కావలసిన పైకం సంపాదించుకొనేవారు.

తన తమ్ముని బలిగొన్న 'స్ప్రూ'వ్యాధిని నిర్మూలించుటకు తగిన మందులను సాధించుటకు కంకణం కట్టుకున్నారు. సుబ్బారావుగారి అవిశ్రాంత పరిశోధనాసక్తిని గమనించిన సియానమిడ్ వైద్య పరిశోధనా సంస్థ వారాయనను తమ లెడర్లీ సంస్థలో పరిశోధకుడుగా ఎన్నుకొన్నారు. లెడర్లీ ప్రయోగశాలలో వైద్య బృందం నాయకులుగ ఫోలిక్ ఆమ్లం యొక్క నిజస్వరూపాన్ని కనుకొన్నారు సుబ్బారావుగారు. 1945జూలై20వ తేదీన ఫోలిక్ ఆమ్లం నుండి బంగారు వన్నె భస్మాన్ని కనుగొన్నారు. ఆ పొడి స్ప్రూ వ్యాధి, మక్రోసైటిక్ అనీమియా అను రక్తహీనత వల్ల కలిగే వ్యాధి నిర్మూలనకు అసమానమైన, అద్భుతమైన మందుగా నిర్ణయింపబడింది.

పాతికేళ్ళపాటు ఆకలి, నిద్ర, అలసటలను విస్మరించి సాగించిన కృషి ఫలితంతో సుబ్బారావుగారెంతో సంతోషించారు. తమ్ముని ప్రాణాలను బలిగొన్న వ్యాధిని ప్రపంచం నుండి పారద్రోలగలిగినానన్న తృప్తి కలిగిందాయనకు. ప్రపంచ మందలి రక్త విజ్ఞాన శాస్త్రవేత్తలలో అగ్రగణ్యులుగా మన్ననలందుకున్నారు. లెడర్లీ సంస్థ డైరెక్టర్‌గా ఆయనను నియమించారు. ఒక భారతీయునికి, ఆ కాలంలో అంత గొప్ప పదవి లభించడం అపూర్వం !

భారతదేశం వచ్చి తన ప్రజలకు సేవ చేయాలనే కోరిక కల్గింది. కలకత్తాలోని 'ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైజిన్ అండ్ పబ్లిక్ హెల్త్' అనే సంస్థకు ఆచార్యునిగా వెళ్ళడానికి ఫోర్డు ధర్మ సంస్థ నిధి సుబ్బారావుగారిని ప్రోత్సహించింది. కాని ఆ సంస్థ నిర్వాహకులైన ఆంగ్లేయులు భారతీయుడన్న ఒకే ఒక కారణంతో సుబ్బారావు గారికి ఆ పదవినివ్వ నిరాకరించారు.

సుబ్బారావుగారు క్షయరోగ నివారణీయగు బసోనికోటి నికాసిడ్, హైడ్రాజైడ్ మందులను కనుగొన్నారు. బోదకాలు, టైఫాయిడ్, పాండురోగం మున్నగు వ్యాధులకు పూర్తిగా నిర్మూలింపగల గొప్ప మందులను కనుగొన్నారు.

విద్యార్థుల పట్ల సుబ్బారావుగారికెంతో ప్రేమ. ఎందరో విద్యార్థులకు ఆర్థిక సహాయమందించారు.

ఏ మాత్రం విశ్రాంతి తీసుకోకుండా పరిశోధనలు సాగించిన సుబ్బారావుగారి ఆరోగ్యం దెబ్బతినింది. 36 గంటలపాటు నిద్రాహారాలు లేక పరిశోధనలో నిమగ్నులయ్యేవారు.

ఆయనలోని మానవుడు, పరిశోధకునికంటే గొప్పవాడై వెలిగాడు. తనతో పాటు

పరిశోధన సాగిస్తున్న యువ పరిశోధకురాలు క్షయవ్యాధితో శ్యానిటోరియం చేరింది. ఆమె చికిత్స కోసం తమ వేతనం నుండి 6 సంవత్సరాలపాటు ఆర్థిక సహాయం ప్రతి నెలా పంపేవారు. తాను అనాథనని ఏ రోగీ భావించరాదని చెప్పేవారాయన.

'నేను పుట్టుకతో ఏమీ పట్టుకొని రాలేదు. చనిపోయేటప్పుడు ఏమీ తీసుకెళ్ళను. నా ఆదాయ వ్యయాలు నా జీవనోపాధికి తగినంత వుండిన చాలు'అన్న ఉదారాశయం కలవారు సుబ్బారావుగారు.

ఆయన నైష్టిక బ్రహ్మచారి. క్రిస్టమస్ పండుగనాడు ఎందరో బీదపిల్లలకు ఉదారంగా కానుకలిచ్చేవారు. విజ్ఞాన శాస్త్రవేత్త అయిన సుబ్బారావుగారు ప్రగాఢ దైవభక్తిగలవారు. వేకువనే ప్రార్థన చేయనిదే ఏ పనీ ప్రారంభించేవారు కారు. తనను ప్రోత్సహించి సహకరించిన రామ కృష్ణ మఠం వారికి క్రమంగా ధన సహాయం చేసేవారు.

1948 లో ఆయనకు అమెరికా పౌరసత్వమిచ్చి గౌరవించింది. లెడర్లీ వైద్య పరిశోధనాకేంద్రం ముఖ ద్వారం దాటిన తర్వాత పెద్ద కాంస్య ఫలకంపై ఉన్న డా.యల్లాప్రగడ సుబ్బారావుగారి చిత్రం క్రింద "యల్లాప్రగడ సుబ్బారావు – 1986–1948 పరిశోధకులు, విద్యావేత్త, తత్వవేత్త, దయామయుడు. లెడర్లీ పరిశోధనా సంస్థ డైరెక్టర్."అన్న వాక్యాలు అందరి దృష్టిని ఆకర్షిస్తాయి. సోదర ప్రజానీకం రోగ విముక్తులు కావాలన్న తపనతో రేయింబగళ్ళు కృషి చేసిన డాక్టర్ యల్లాప్రగడ వారు 'కరోనరి త్రాంబసిస్'వ్యాధితో 1948 ఆగష్టు 9వ తేదీన అమెరికాలో కన్నుమూశారు.

ఈ ప్రముఖ భారతీయ వైద్యుని పట్ల గౌరవసూచకంగా బొంబాయిలోని బల్సార్‌లో నిర్మించిన తమ ప్రయోగశాలకు డా. యల్లాప్రగడ సుబ్బారావు సంస్థ అని నామకరణం చేశారు లెడర్లీ సంస్థ వారు.

ఆయన మానవాళికందించిన వైద్య విధానాలు చిరకాలం జీవించి ఉంటాయి.

"భారత రత్న"

# సర్.సి.వి. రామన్



మద్రాసు ప్రెసిడెన్సి కాలేజీలో బి.ఏ.తరగతి గది. ఆంగ్ల పద్య భాగమును బోధించు ప్రొఫెసర్ ఇలియట్ తరగతిలో ప్రవేశించి విద్యార్థులందరినీ ఒక మారు కలయజూచాడు. మూడవ వరుసన కూర్చున్న ఒక విద్యార్థిని చూచి ఆశ్చర్యంతో ...

'నీవీక్లాసు విద్యార్థివేనా?'అని ప్రశ్నించాడు. తరగతిలోని విద్యార్థులందరూ ఘొల్లుమని నవ్వారు.

ఆ విద్యార్థి బక్కగా పొట్టిగా వుండేవాడు. ఆ దినమే అతడు కళాశాలలో చేరాడు.

'ఔను, సర్, నేను ఈ తరగతి విద్యార్థిని, నా వయసు 13 ఏళ్ళు. ఇంటర్ మీడియట్ విద్యను వాల్తేర్ కాలేజీలో పూర్తిచేశాను. నా పేరు సి.వి. రామన్' అన్న సమాధానం నిర్భయంగా చెప్పాడు. ప్రొఫెసర్ వేసిన ప్రశ్నలన్నింటికీ ధైర్యంగా చకాచకా చెప్పాడు. ప్రొఫెసర్, ఆ బాలుని తెలివితేటలకు ముగ్ధుడయ్యాడు. నాటి నుండి ప్రొఫెసర్ ఇలియట్ ప్రియశిష్యులలొ ఒకడయ్యాడు సి.వి. రామన్.

చంద్రశేఖర వెంకటరామన్ 1888 నవంబర్ 7వ తేదీన తిరుచినాపల్లి సమీపంలోని అయ్యన్ పెటాయ్ అనే గ్రామంలో జన్మించాడు.తండ్రి చంద్రశేఖర అయ్యర్, తల్లి పార్వతి అమ్మాళ్. వారిది మధ్య తరగతి కుటుంబం. వ్యవసాయం చేస్తూ జీవనం సాగిస్తుండేవారు.

తిరుచినాపల్లి హైస్కూల్‌లో ఉపాధ్యాయుడుగా చేరిన చంద్రశేఖర అయ్యర్ స్వయంకృషితో ఉన్నత విద్యనభ్యసించాడు. "పోలనుద్యోగికిని దూరభూమిలేదు"అన్న సూక్తి మేరకు స్వస్థలానికి దూరంగా వున్న విశాఖపట్నంలోని, మిసెస్ ఎ. వి.ఎన్. కాలేజీలో ఫిజిక్స్ ప్రొఫెసర్‌గా చేరారు. భౌతిక శాస్త్రం, జ్యోతిష్య శాస్త్రాలలోనేగాక, వీణ, వాయులీన్ వాదనములలోను నైపుణ్యంగల వాడు చంద్రశేఖర అయ్యర్. సి.వి.రామన్ తల్లి పార్వతి అమ్మాళ్ తండ్రి గొప్ప సంస్కృత పండితుడు. సహనానికి, పట్టుదలకు మారుపేరు ఆమె.

విద్యార్థి దశలో అనిబెసెంటుగారి అనర్గళమైన ఉపన్యాసాలు రామన్‌ను ఆకర్షించాయి. మద్రాసు ప్రెసిడెన్సికాలేజీలో బి.ఏ. చదువుతున్నపుడే 'హిందూ పురాణములు'అన్న వ్యాసం వ్రాసి ప్రథమ బహుమతి నందుకొన్నాడు. నిరంతరం అధ్యయన శీలి రామన్. బి.ఏ.లో ప్రథమ శ్రేణిలో ప్రథముడుగా ఉత్తీర్ణుడై, ఎల్‌ఫిన్‌స్టన్ బంగారు పతకంతో పాటు మరెన్నో విలువైన బహుమతులందుకొన్నాడు.

పదార్థ విజ్ఞాన శాస్త్రంతో ఎం.ఏ. తరగతిలో చేరాడు. తరగతిలో అధ్యాపకులు , విద్యార్థులు రామన్‌పట్ల అత్యంత గౌరవ భావంతో వ్యవహరించే వారు. ప్రయోగశాల, గ్రంథాలయం అతనికి ఎల్లవేళలా అందుబాటులో వుండేవి. ధ్వనిశాస్త్ర విషయమున రామన్ ప్రయోగమారంభించాడు. ఇది వరకు ఎవరూ కనుగొనని లక్షణములను కనుగొన్నాడు. ప్రొఫెసర్ జోన్స్‌కు తన ప్రయోగ వివరములను నివేదించాడు. ఆ వివరములను పరిశీలించిన, ప్రొఫెసర్ రెలే రామన్ ప్రయోగాలను ప్రశంసించాడు. రామన్ తన పరిశోధనను వ్యాసరూపంగా సిద్ధపరచి ప్రొఫెసర్‌గారికి పరిశీలించమని యిచ్చాడు. ఆరు నెలలు దాటినా ప్రొఫెసర్ తన కాగితాలను యివ్వలేదు. శుద్ధ ప్రతి వ్రాసి యిచ్చెదనని చెప్పి, తన వ్యాసాన్ని తీసుకుని, "ఫిలసాఫికల్ మ్యాగజైన్ ఆఫ్ లండన్"అను పత్రికకు 1906 లో పంపాడు.లండన్ నుండి వెలువడిన ఆ పత్రికలో రామన్ వ్యాసం ప్రకటింపబడినది. ప్రొఫెసర్లు రామన్ ప్రతిభను గొప్పగా శ్లాఘించారు. 1907 లో రామన్ ఎం.ఏ. (ఫిజిక్స్)పరీక్షలో మద్రాసు విశ్వవిద్యాలయ చరిత్రలోనే ప్రప్రథమశ్రేణి విద్యార్థిగా ఉత్తీర్ణుడయ్యాడు.

పెద్దలు, మిత్రులు రామన్‌ను ఇంగ్లండు వెళ్ళి పరిశోధన సాగించమని ప్రోత్సహించారు. కాని రామన్ శారీరకంగా దుర్బలుడైనందున ఇంగ్లండు వాతావరణం అతనికి అనుకూలించదని వైద్యులు చెప్పారు. రామన్ ఆ ప్రయత్నం విరమించుకున్నారు. ఉద్యోగార్థియై, చరిత్ర, అర్థ శాస్త్రములు ప్రత్యేక విషయములుగా చదివి పోటీ పరీక్షలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడైనాడు. "డెప్యూటీ అకౌంటెంట్ జనరల్ ఆఫ్ ది ఫైనాన్స్ డిపార్ట్‌మెంట్"గా ఎన్నుకోబడినాడు. అప్పుడు రామన్ వయసు 18ఏళ్ళు.

కలకత్తాలో ఉద్యోగమున చేరకముందే 'లోక సుందరి'అను నామెతో అతని వివాహం జరిగింది. వారిది శాఖాంతర వివాహం. ఆ రోజులలో అది గొప్ప మార్పు. రామన్ కలకత్తాలో డెప్యూటీ అకౌంటెంట్ జనరల్‌గా చేరాడు. కాని అతని

మనసంతా శాస్త్రపరిశోధనపట్ల వుండేది.

ఒకనాడు కలకత్తా వీధిలో ట్రామ్‌బండిలో ప్రయాణం చేస్తుండగా "ది ఇండియన్ అసోసియేషన్ ఫర్ ది కల్టివేషన్ ఆఫ్ సైన్స్" అను బోర్డు అతని కంటపడింది. వెంటనే ట్రామ్ బండినుండి దిగి, ఆ భవనం ప్రవేశించాడు. శాస్త్రవేత్తలు సమావేశం ముగించి వెళ్తున్నారు. ఆ సంస్థ కార్యదర్శి మహేంద్ర లాల్‌సర్కార్‌ను కలుసుకొన్నాడు. మరుసటి దినం నియమిత కాలంలో ఇరువురు సమావేశమయ్యారు. రామన్ తన పరిశోధనలను మహేంద్రలాల్‌సర్కార్‌కు వివరంగా చూపించాడు. రామన్ ప్రతిభకు నివ్వెరపోయిన సర్కార్, రామన్‌కు తమ సంస్థలో ప్రవేశం కల్పించి నిరాఘాటంగా, స్వతంత్రంగా ప్రయోగములు సాగించుటకు ప్రత్యేక సౌకర్యములు కల్పించాడు. రామన్ రాకతో సంస్థ ప్రతిష్ట బాగా పెరిగింది. కలకత్తా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడైన అశుతోష్ ముఖర్జీ రామన్‌ను ఎంతో ఆదరించాడు.

రామన్‌ను ప్రభుత్వం రంగూన్‌కు బదిలీ చేసింది. రంగూన్‌లో ఉన్నపుడే తండ్రి మరణించాడు. ఆరు నెలలు సెలవు పెట్టి మద్రాసు వచ్చిన రామన్ ప్రెసిడెన్సీ కాలేజీలో ప్రయోగాలు చేయసాగాడు. నాగ్‌పూర్‌కు బదిలీ అయ్యారు. అక్కడ సహోద్యోగుల ఈర్ష్యాసూయలతో బాధపడినాడు. మరలా కలకత్తాకు బదిలీ కావటం రామన్‌కెంతో ఆనందం కలిగించింది.

కలకత్తా విశ్వవిద్యాలయమున భౌతిక శాస్త్రంలో ఆచార్య పీఠం 1915లో నెలకొల్పబడింది. అందుకు భూరివిరాళమిచ్చిన సర్ తారకనాథ్ పాలిట్ దృష్టి రామన్‌పై పడింది. ఇంగ్లండులో పెద్ద చదువులు నేర్చివచ్చిన వారే ఆ పదవికి అర్హులని పేర్కొనబడింది. కాని వైస్ ఛాన్స్‌లర్ అశుతోష్ ముఖర్జీ, అన్ని నిబంధనలను సడలించి సి.వి. రామన్‌ను ఆ పదవికి ఎన్నుకొన్నాడు. ప్రభుత్వంలోని ఉన్నత పదవికి వెంటనే రాజీనామా యిచ్చిన రామన్ కలకత్తా విశ్వవిద్యాలయంలో ఫిజిక్స్ ప్రొఫెసర్‌గా చేరాడు. 1919 లో రామన్ 'ఇండియన్ అసోసియేషన్ ఫర్‌ది కల్టిభేషన్ ఆఫ్ సైన్సు' సంస్థకు కార్యదర్శిగా ఎన్నుకోబడినాడు.1922 బ్రిటిష్ యూనివర్సిటీ కాంగ్రెస్ సభలో భారతదేశ ప్రతినిధిగా ఎన్నుకోబడినాడు. 1924 లో కెనడాలోని 'సైన్స్ కాంగ్రెసు'కు విశేష ప్రతినిధిగా వెళ్ళి విదేశాలలో పలుచోట్ల ఉపన్యాసాలిచ్చాడు. అపూర్వంగా, రాయల్ సొసైటీ, రామన్‌కు 1924 లో ఫెలోషిప్ సత్కారమిచ్చి గౌరవించింది. 1924 లోనే రామన్ ఇండియన్ సైన్స్ కాంగ్రెస్ సంస్థను నెలకొల్పాడు. 1925లో రష్యన్ సైన్స్ అకాడమి ఆహ్వానంపై మాస్కో వెళ్ళాడు.

కొన్నేళ్ళు, నిరంతర పరిశోధనా ఫలితంగా 1928లో "రామన్ ఎఫెక్ట్" ను కనుకొన్న, సి.వి.రామన్‌కు నోబెల్ బహుమతి లభించింది. ఆసియా ఖండంపై ఆ సత్కారం అందుకొన్న శాస్త్రవేత్తలలో మొట్టమొదటివాడు సి.వి.రామన్.

15 సంవత్సరాలు కలకత్తా విశ్వవిద్యాలయంలో, అపూర్వంగా పనిచేసిన సి.వి.రామన్ బెంగుళూరులోని' ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్' సంస్థ డైరెక్టర్‌గా

చేరాడు. 1934లో ఇండియన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ సంస్థ అవతరించింది. 1948 లో రామన్ తమ స్వంత సంస్థ రామన్ రిసర్చ్ ఇన్‌స్టిట్యూట్ ను ప్రారంభించాడు. ఆ సంస్థలో అధ్యయనం చేసిన, రామన్ శిష్యులలో అగ్రగణ్యులు డా. హోమి జె.భాభా, డా.సూరిభగవంతం, డా. విక్రమ్‌సారాభాయ్, డా.కె.యస్.కృష్ణన్, డా. రామశేషన్ మున్నగువారు.

స్వతంత్ర భారతావరణంలో శాస్త్రీయ పరిశోధనా రంగంలో కొత్త అధ్యాయం ప్రారంభమైంది.

రామన్ కీర్తి ప్రపంచమంతటా వ్యాపించింది. బ్రిటిష్ ప్రభుత్వం అతనిని 'సర్' బిరుదంతో సత్కరించింది. ప్రపంచమందలి ప్రముఖ విశ్వవిద్యాలయాలెన్నో అతనిని గౌరవ డాక్టరేట్ బిరుదములతో సత్కరించాయి. 1954లో భారత ప్రభుత్వం అతనిని 'భారత రత్న' ప్రశస్తితో గౌరవించింది. కొన్ని వందల ఘన సన్మానాలందుకొన్న మహామనీషి సర్– సి.వి.రామన్.

రామన్ సంగీత శాస్త్రములో చక్కని ప్రవేశం కలవాడు. మృదంగ వాద్యంపై, శబ్దతరంగాలపై ప్రయోగాలు సాగించాడు. రామన్ పరిశోధనలు ఫొటోగ్రఫీ, రబ్బర్ ప్లాస్టిక్ పరిశ్రమల కెంతో తోడ్పడింది.

రామన్ విజ్ఞానశాస్త్ర ప్రగతికెంతో కృషి చేశాడు. రాజకీయవాదులు వైజ్ఞానిక రంగంలో ప్రవేశించకూడదని ఆయన అభిప్రాయం.

ప్రతి ఏటా, ప్రధాని నెహ్రూ ఇండియన్ సైన్స్ కాంగ్రెస్ మహాసభలను ప్రారంభించటం రామన్‌కు నచ్చలేదు. ఆయన శిష్యుడైన శ్రీ వి.టి.శ్రీనివాసన్, రామన్‌తో మాట్లాడుతూ ఆ విషయం ప్రస్తావించగా 'ప్రపంచంలో ఏ దేశంలో నైనా, రాజకీయ నాయకులు విజ్ఞాన శాస్త్ర సమావేశాలను ప్రారంభించారా? గత 17ఏళ్ళుగా, సంస్థ నిర్వాహకులు, మన ప్రధానితోనే ఎందుకు ప్రారంభింపజేస్తున్నారో నాకు అర్థం కావటం లేదు. ఇప్పుడు ఆయన లేరు, ఆయన కూతురుతో, ఈ పని చేస్తున్నారు. ఇదే మాత్రం సముచితం కాదు.' అందుకే ఇండియన్ అకాడమి ఆఫ్ సైన్సెస్ అవతరించింది.

రామన్ హాస్య చతురుడు. కొన్ని దశాబ్దాల క్రితం బెంగుళూరులోని ఒక బ్యాంకర్ (ధర్మరత్నాకర గోపాలరావు) గారి వద్ద రామన్ 75వేల రూపాయలు వుంచాడు. కొద్ది కాలం తర్వాత ఆ బ్యాంకర్ దివాలా అయినట్లు తెలిసింది. 'నోబెల్ బహుమతి గ్రహీతకే టోపీ పెట్టిన, ఆ బ్యాంకర్‌కు నోబెల్ పారితోషికం ఇవ్వటం సబబు'అన్నాడు డా.సి.వి. రామన్.

"కార్యసాధకులకు హంగులు ఆర్భాటాలు అనవసరం. నోబెల్ బహుమతి కొరకు నేను సాగించిన ప్రయోగానికి నా పెట్టుబడి కేవలం రెండు వందల రూపాయలే!" అన్నారాయన. జాతీయ పరిశోధనాలయాలపై అనవసరంగా విపరీతమైన ధనాన్ని వ్యయపరచటం రామన్‌గారికి సరిపడేది కాదు. అందువల్లనే "షాజహాన్ తన ప్రియురాలి శవాన్ని ఖననం చేసేందుకు తాజ్‌మహల్ నిర్మించాడు. జాతీయ ప్రయోగశాలలు శాస్త్ర పరిశోధనా పరకరాలను నిక్షేపం చేసేందుకు నిర్మించారు" అన్నారాయన.

రామన్ ఎంత గొప్ప శాస్త్రజ్ఞుడో అంత గొప్ప వక్త. అతి క్లిష్టమైన శాస్త్రీయ విషయాలను జనరంజకంగా ఉపన్యసించగల మహామేధావి ఆయన.

మానవతావాది డా. రామన్. శాస్త్రవేత్తల పరిశోధనలు ప్రపంచ ప్రజల క్షేమానికి వినియోగపడాలని చాటిచెప్పిన మహనీయుడు సర్.సి.వి. రామన్.

జీవితమంతా శాస్త్ర పరిశోధనలో గడిపి, భారతదేశ కీర్తి పతాకను రెపరెపలాడించిన సర్. సి.వి. రామన్ తన 83వ ఏట 1970 నవంబర్ 21 వ తేదీన దివంగతుడయ్యాడు.

# మరపురాని మహా నటుడు
# నాగయ్య



అది తిరువాన్కూరు మహారాజావారి దర్బార్ హాలు. మహాపండితులు, సంగీత, నాట్య, నటన కళాకోవిదులతో సభా భవనం క్రిక్కిరిసి పోయింది.మేళతాళాలతో సకల రాజ మర్యాదలతో రాజదర్బారు ప్రవేశంచాడొక తెలుగు నటుడు.మహా రాజా గద్దెదిగి ఎదురేగి ఆ నటశ్రేష్టుని సాదరంగా కౌగలించు కొన్నాడు. తన గద్దె ప్రక్కన ఏర్పాటు చేసిన సమున్నతమైన ఆసనంపై కూర్చుండజేసి, వేదమంత్ర పఠనం మధ్య, నటునికి పాదపూజ చేసి అమూల్యమైన కానుకలను అందచేయటంతోపాటు 'అభినవ త్యాగరాజ ' బిరుదంతో సత్కరించాడు.

మైసూరు సంస్థానాధీశ్వరుడు తన రాజ ప్రాసాదంలో ఆ నటరాజుకు సకల రాజ లాంఛనాలతో స్వాగతంపలికి పెద్ద వెండి పళ్ళెంలో 101 బంగారు కాసులు పోసి బహూకరించాడు.

ఇలా రాజాస్థానాలలో అపూర్వమైన సత్కారాలను అందుకొన్న తెలుగు నటశిరో మణి చిత్తూరు నాగయ్య.

భారతదేశంలో భక్తి రస ప్రధానమైన పాత్రలు ధరించి ఆయనవలె ప్రజల మన్నన లందుకున్న వారెవరూ లేరు.

నాగయ్య 1904 మార్చి 28 వ తేదీన గుంటూరు జిల్లా రేపల్లెలో జన్మించాడు. తండ్రి ఉప్పల ధడియం రామలింగేశ్వర శర్మ గారు అక్కడ రెవిన్యూ శాఖలో

ఉద్యోగిగా వుండేవారు. చిన్నప్పటినుండి భాగవత, భారతాలపట్ల అమితమైన ఆసక్తి నాగయ్యకు. తండ్రి చక్కని సంగీత విద్వాంసుడు. పండితుడు. తండ్రి సంగీత కళాభిజ్ఞత తనయుడుని బాల్యంలోనే ఆకర్షించింది.

తండ్రి శిక్షణలో సంగీత సాధన ప్రారంభించాడు. పాఠశాలకు వెళ్ళడం కంటే సంగీత కచ్చేరీలకు వెళ్ళటం ఎంతో సరదాగా వుండేది బాల నాగయ్యకు. దూరంగా వున్న ఒక వూళ్ళో సంగీత కచ్చేరి జరుగనున్న విషయం విన్నాడు. ఇంట్లో మాట మాత్రం చెప్పక తన చెవి పోగుల్ని అమ్మి ఆ డబ్బుతో రైలు టిక్కెట్ కొని సంగీత కచ్చేరి విని ఇంటికి తిరిగి వచ్చాడు. కొడుకు సంగీతాభిరుచిని గుర్తించిన తండ్రి, కుమారుణ్ణి సంగీత విద్యాభ్యాసం కొరకు సంగీత విద్వాన్ చిత్తూరు పేరయ్య పిళ్ళె వద్దకు పంపాడు.

ఒకమారు మహా విద్వాంసులైన పుష్పవనం అయ్యర్, గోవిందస్వామి పిళ్ళె గార్ల సంగీత కచ్చేరీకి నాగయ్య హాజరయ్యాడు. కచ్చేరి పూర్తి అయ్యింది. శ్రోతలందరూ వెళ్ళి పోయారు. నాగయ్యమాత్రం అలాగే నిల్చుని పుష్పవనం అయ్యర్ వంక అదే పనిగా చూడ సాగాడు. అయ్యర్, "ఏం అబ్బాయ్, ఏం కావాలి? నీ పేరేమి? అని ప్రశ్నించాడు. నా పేరు ' ప్రహ్లాదుడు ' అని జవాబిచ్చాడు బాలుడు. 'సరే కాని,నీకేమైనా సంగీతం వచ్చా' అని అడిగాడు. 'ఓ–వినండి' అంటూ భాగవతంలోని ప్రహ్లాదుని పద్యాలను మధురంగా భావయుక్తంగా పాడాడు. గోవింద స్వామి పిళ్ళె ఆనందంగా వయోలిన్ వాయించాడు. రెండు గంటలసేపు పద్యాలు పాడాడు. అయ్యర్ ఆనంద్ పరవశుడై 'బాబు, నీవు గొప్ప కళాకారుడవుతావు' అని ఆశీర్వదించాడు. ఈ సంఘటనను పలు మార్లు మిత్రులకు చెప్పేవాడు నాగయ్య.

కంచిలో నయన పిళ్ళై వద్ద, కుంభ కోణంలో సంగీత కళానిధి మహారాజపురం విశ్వనాధ అయ్యర్ వద్ద సంగీత విద్యాభ్యాసం సాగించాడు నాగయ్య. చిత్తూరులో మద్రాసు ప్రెసిడెన్సి కాలేజీలో అతని చదువు కొంతవరకు సాగింది. మనసంతా సంగీతంపై వున్నపుడు కాలేజీలో చదవటం ఎలా సాగుతుంది? కాలేజీ చదువు అర్ధంతరంగా ముగిసింది. విద్యార్థిగా నాటకాల్లో వేషాలు వేసి ప్రశంసలందుకొన్నాడు.

మద్రాసులో చదువుకు 'గుడ్‌బై' చెప్పిన నాగయ్య చిత్తూరు జిల్లా బోర్డు ఆఫీసులో గుమాస్తాగా చేరాడు. స్థానిక రామ విలాస సభ నాటక సంఘంవారితో పరిచయం లభించింది.

చిత్తూరులో రామ విలాస సభ, లక్ష్మి విలాస సభ, మద్రాసులో సుగుణ విలాస సభ, ఇండియన్ ఫైన్ ఆర్ట్స్ సొసైటి మున్నగు నాటక సంస్థలు ప్రదర్శించిన నాటకాలలో, మొదట సావిత్రి, దమయంతి, చిత్రాంగి వేషాలు ధరించి ప్రశంసంలందుకొన్నాడు.

నాటకరంగ ప్రవేశంతో మహానటులైన బళ్ళారి రాఘవ, పర్వతనేని రామ చంద్రా రెడ్డి మొదలగు వారితో కలిసి పలు నాటకాలలో అభినయించాడు. రామదాసులో కబీరు వేషధారిగ కహో రామ్ నామ్ అంటూ పాడుతూ రంగ ప్రవేశం చేయటంతోనే

ప్రేక్షకుల కరతాళ ధ్వనులతో నాటక మందిరం మార్మోగింది. దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు గారు నాగయ్య నటనా కౌశలాన్ని మెచ్చుకొని బంగారు పతకంతో పాటు 'రంగ భూషణ' బిరుదంతో సత్కరించారు.

కర్ణాటక సంగీతంలోనే కాక, హిందుస్తానీ సంగీతంలో కూడా దిట్ట నాగయ్య. కాని జీవితంలో కష్టాలెదురైనాయి. తండ్రి మరణించాడు. మొదటి భార్య ప్రసవించిన తర్వాత తల్లీ, బిడ్డ చనిపోయారు. రెండవ భార్య అయనకు దూరమైంది. మనశ్శాంతిలేని నాగయ్య రమణ మహర్షి ఆశ్రమంలో కొంత కాలం గడిపాడు. పుణ్యక్షేత్రాలు చూశాడు. 'నీ కార్యక్షేత్రం కళారంగం, వెళ్ళు మరలా కళాకారుడవై ఆత్మ శాంతిని సాధించు' అని అంతరాత్మ బోధించింది. మరలా చిత్తూరు చేరాడు.

1932 లో జాతీయ కాంగ్రెస్‌లో స్వయం సేవకుడుగా చేరి మద్రాసు వెళ్ళాడు. ప్రకాశం పంతులు, సత్యమూర్తి, రాజాజీ మున్నగు నాయకుల పరిచయం కలిగింది. గుమాస్తా ఉద్యోగానికి రాజీనామా యిచ్చాడు. లాఠీ ఛార్జీలు, లాకప్‌లు చవిచూశాడు. వార్ధాకు వెళ్ళి గాంధీజీని దర్శించాడు. తిరిగి మద్రాసు వచ్చాడు. రాజకీయరంగం వదలి మరలా కళారంగంలో అడుగు పెట్టాడు. ఫిల్మ్ కంపెనీలు పెడతామని కొందరు ప్రలోభ పెట్టి నాగయ్యను వంచించారు.

చేత చిల్లిగవ్వలేక మద్రాసు వీధుల్లో తిరుగుతూ, ఆకలి బాధతో నుంగబాకంలో క్రింద పడిపోయాడు.దారిన పోతున్న హెచ్చిన్స్ కంపెనీ యజమాని, నాగయ్య పాత మిత్రుడు అయిన అచ్యుతనాయుడు నాగయ్యను గుర్తుపట్టి భోజన వసతులు కల్పించాడు.

నాయుడుగారి ప్రోత్సాహంతో నాగయ్య ఎన్నో గ్రాంఫోను రికార్డులిచ్చాడు. "హిజ్ మాస్టర్స్ వాయిస్" కంపెనీ వారు నాగయ్య కంఠ మాధుర్యానికి ముగ్ధులై తమ కంపెనీలో మ్యూజిక్ డైరెక్టర్‌గా నియమించుకొన్నారు. నాగయ్య పాడిన రికార్డులు విపరీతంగా అమ్ముడుపోయాయి.

1935 లో బి.ఎన్.రెడ్డి గారిని నాగయ్య కలుసుకొన్నాడు. వెంటనే రెడ్డిగారు తమ మిత్రులైన హెచ్.ఎం. రెడ్డిగారికి నాగయ్య గారిని పరిచయం చేశారు. హెచ్.ఎం. రెడ్డి నాగయ్య కంఠమాధుర్యానికి పరవశుడయ్యాడు. తాను తీసే 'గృహలక్ష్మి'చిత్రంలో సంఘ సేవకుని పాత్ర యిచ్చాడు. ఆ వేషంలో నాగయ్య పాడిన, "కల్లు మానండోయ్ బాబూ, కళ్ళు తెరవండోయ్" అన్న పాట ఆంధ్రదేశమంతటా ప్రతిధ్వనించింది. అప్పట్లో మద్యపాన నిషేధం అమలులో వుండేది కాన ఆ పాటకు జనాదారణ అమితంగా లభించింది.

బి.యన్. రెడ్డిగారు మూలానారాయణ స్వామితో కలిసి వాహినీ పిక్చర్స్ అనే సంస్థను ప్రారంభించారు. వందే మాతరం, సుమంగళి, దేవత, మున్నగు చిత్రాల్లో నటించిన నాగయ్యకు అశేష పేరు ప్రఖ్యాతులు వచ్చాయి.

"ఫిల్మ్ ఇండియా" సంపాదకుడు నాగయ్య నటనా వైదుష్యాన్ని వేనోళ్ళ

కొనియాడుతూ, నాగయ్యను 'ఆంధ్రా పాల్ ముని' గా కీర్తించాడు.

కె.వి. రెడ్డిగారు, ' భక్త పోతన ' చిత్రంలో, పోతన పాత్ర ధారణకు నాగయ్యను ఎన్నుకొన్నాడు. పోతనగా, నాగయ్యచూపిన హావభావాలు, భక్తుడుగా ఆయన అభినయం చిరస్మరణీయం. 'పావన గుణ రామా' అను పాట ఈనాటికీ చిత్రం చూచిన వారిని మైమరపిస్తుంది. అసమాననటుడుగా ప్రశంసలందుకొన్నాడు.

నాగయ్య స్వయంగా రేణుకా ఫిల్మ్స్ అనే సంస్థను ప్రారంభించి త్యాగయ్య చిత్రాన్ని నిర్మించి చరిత్ర సృష్టించాడు. ఆ చిత్రం ప్రారంభించుటకు ముందు తిరువాయూర్‌లోని త్యాగ రాజుల సమాధి వద్ద కొన్ని రోజులు ఉపవాస దీక్ష చేశాడు. 'త్యాగయ్య' చిత్రంలో నాయకుడుగా సంగీత దర్శకుడుగా అఖండ కీర్తినార్జించాడు.' త్యాగయ్య' చిత్రం యునెస్కో ఆధ్వర్యంలో జరిగిన అంతర్జాతీయ చిత్రోత్సవంలో ప్రదర్శించబడి భారతదేశ కీర్తి పతాకను ఎగుర వేసింది.

తెలుగు చిత్రాలతోపాటు నాగయ్య తమిళ చిత్రాలలో కూడా నటించాడు. మోసాలు, తంత్రాలు తెలియని నాగయ్య 'భక్త రామదాసు' చిత్ర నిర్మాణంలో పెక్కు అడ్డంకులను ఎదుర్కొన్నాడు. 'రామదాసు' అనుభవించిన సంకటాలను అనుభవించాడు. చిత్రం ఎలాగో బయట పడింది. కాని నాగయ్య ఆశించిన రీతిలో రాలేదు. మరలా మనశ్శాంతిని కోల్పోయి పుట్టపర్తి సాయి బాబాను ఆశ్రయించాడు. బాబా ఆధ్వర్యంలో, మద్రాసులో నాగయ్య షష్టిపూర్తి ఉత్సవాలు వైభవంగా జరిగాయి.

నాగయ్యకు జరిగిన సన్మానాలు మరే నటునికీ జరగలేదు. 1965 లో భారత ప్రభుత్వం అతనికి 'పద్మశ్రీ' నిచ్చి గౌరవించింది. దక్షిణ భారత సినిమారంగంలో 'పద్మశ్రీ' అందుకొన్న మొదటి నటుడు నాగయ్య.

నాలుగు దశాబ్దాల సినిమా జీవితంలో నాగయ్య 200 తెలుగు, కన్నడ, మలయాళ, హిందీ చిత్రాల్లోను, 160 తమిళ చిత్రాల్లోను నటించాడు.

నాగయ్య మహానటుడేకాదు, మహాదాత. ఎన్నో దాన ధర్మాలు చేశాడు. ఆంధ్రరాష్ట్రవతరణ సందర్భంలో, నాగయ్య 20 వేల రూపాయలు అప్పుగా తెచ్చి ఆంధ్ర కేసరికి విరాళంగా సమర్పించాడు.

"నేను ఎన్నోసార్లు మోసపోతున్నాను. అందరి మాటా నమ్ముతాను. అందర్నీ విశ్వసిస్తాను.! అదే నా ఆర్థిక పతనానికి కారణమైంది" అని తన ఆత్మకథలో వ్రాసుకొన్నాడాయన.

లక్షలార్జించిన నాగయ్య చివరదశలో కఠిన దారిద్ర్యాన్ని అనుభవించాడు. చిన్న చిన్న వేషాలు వేయాల్సి వచ్చింది, డబ్బుకోసం.!

పోతన, త్యాగయ్య, రామదాసు మున్నగు పాత్రలలో భక్తి రసామృతాన్ని పంచిపెట్టిన నాగయ్య నటించిన వేమన, పోతన చిత్రాలను చూచి ఒక బాలుడు యోగిగామారి ముమ్మిడివరం 'బాలయోగి' అయ్యాడు.

ఒకమారు రాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణన్ మద్రాసు వచ్చారు. ఆయన దర్శనం

కోసం నాగయ్య, గుమ్మడి మరో మిత్రుడు వారి దగ్గరకు వెళ్ళారు. నాగయ్య గారు వచ్చారని విన్న రాధాకృష్ణన్ స్వయంగా వచ్చి నాగయ్యను ఆహ్వానించారు. నాగయ్యతో పాటు వచ్చిన మూడోవ్యక్తి, రాధాకృష్ణన్ గారికి, పాదాభివందనం చేస్తే "మావంటివారికి పాదాభివందనం ఎందుకయ్యా? మీ ప్రక్కనే వున్న నాగయ్యగారికి చేస్తే మీకు పుణ్యం వస్తుంది అన్నారట"రాధాకృష్ణన్. ఆమాటకు నాగయ్య పులకించి పోయాడు.

నాగయ్య చివరిదశలో మూత్రసంబంధమైన వ్యాధికి గురై అడయార్‌లోని వి.హెచ్.ఎస్. సెంటర్‌లో చేర్చబడ్డాడు. మృత్యుదేవతతో పోరాడుతున్న నాగయ్య వద్దకు అతని మిత్రులు ముదిగొండ లింగమూర్తి, ఇంటూరి వెంకటేశ్వరరావు అతని శయ్యవద్దనిల్చి " రఘుపతి రాజారాం" గీతం పాడుతుండగా వింటూ అపర పోతన నాగయ్య 1973 డిసెంబర్ 30వ తేదీన కన్నుమూశాడు. తెలుగు సినిమా నటీనటుల విరాళాలతో ఆయన అంత్యక్రియలు జరిగాయి. డా. ఇంటూరి వెంకటేశ్వరరావు గారు, మిత్రులు అభిమానులు మున్నగు వారి సహకారంతో మద్రాసు త్యాగరాయ నగర్‌లోని పానగల్ పార్కులో, ఈశాన్య భాగంలో 'నటయోగి నాగయ్య' కాంస్య విగ్రహాన్ని ప్రతిష్ఠింపచేయగా రాష్ట్రపతి వి.వి.గిరి గారు ఆ విగ్రహాన్ని ఆవిష్కరించారు.

ఏటేటా ఆ విగ్రహం వద్ద డిసెంబరు 30వ తేదీన నాగయ్య వర్ధంత్యుత్సవాలు జరుపుకుంటూ ఆ మహానటునికి జోహార్లు అర్పిస్తున్నారు.

చిరస్మరణీయుడు

# పింగళి వెంకయ్య



"ఈ పతాకం సామాన్యమైనది కాదు. సామ్రాజ్యవాద సూచకం కాదు. ఏ దేశాన్నీ ఆక్రమించే విధానాన్ని సూచించే కేతనం అసలేకాదు. ఇది మన స్వాతంత్ర్య చిహ్నం." భారత రాజ్యాంగ సభలో జాతీయ పతాకాన్ని ప్రవేశపెడుతూ జవహర్‌లాల్ నెహ్రూ అన్న మాటలివి.

ఒక జాతి స్వాతంత్ర్యం, సౌభాగ్యం, సంపద పతాకంలో ప్రతిబింబిస్తూ ఉంటాయి. మన దేశంలో మొదటిసారిగ జాతీయ పతాకం కలకత్తాలోని గ్రీన్‌పార్క్‌లో 1906 ఆగష్టు 7వ తేదీన ఎగురవేశారు.

1907లోనే ప్యారిస్ నగరంలో మేడం కామా జాతీయ పతాకం రూపొందించి ఎగురవేశారు. 1917లో హోమ్‌రూల్ ఉద్యమంలో ఈ పతాకమే రెపరెపలాడింది.

1907లోనే ఒక మేధావి జాతీయ పతాకాన్ని రూపొందించుటకు యత్నించాడు. 1916లో' భారత దేశానికి ఒక జాతీయ పతాకం' అనే ఆంగ్ల గ్రంథాన్ని రచించాడు. ఆ నిష్కళంక దేశభక్తుడే పింగళి వెంకయ్యగారు. ఆయన రూపొందించిందే నేటి మన జాతీయ పతాకం.

శ్రీ వెంకయ్య, కృష్ణాజిల్లా భట్ల పెనుమర్రు గ్రామంలో 1878ఆగష్టు 2వ తేదీన జన్మించారు. తండ్రి హనుమంతరాయుడు గారు దివితాలూకా యార్లగడ్డ గ్రామకరణం.

మాతామహులైన అడివి వెంకటాచలంగారు చల్లపల్లి సంస్థానం ఠాణేదారు. ఆయనకు పెదకళ్ళేపల్లి బదిలీ కావటం వల్ల వెంకయ్యగారి ప్రాథమిక విద్య అక్కడే పూర్తి అయింది. బందరులో హైస్కూలు చదువు పూర్తి చేశారు.

శౌర్య, సాహసం మూర్తీభవించిన వెంకయ్యగారు బొంబాయి వెళ్ళి, 19వ ఏట సైన్యంలో చేరి దక్షిణాఫ్రికాలోని బోయర్ యుద్ధంలో పాల్గొన్నారు.స్వదేశం వస్తూ అరేబియా, ఆఫ్ఘనిస్తాన్‌లు చూచివచ్చారు.

మద్రాసులో ప్లేగ్ ఇన్‌స్పెక్టరు శిక్షణ పూర్తి చేసి, కొంతకాలం బళ్ళారిలో ప్లేగ్ ఇన్‌స్పెక్టర్‌గా పని చేశారు. ఆయన జ్ఞాన దాహం అంతులేనిది. శ్రీలంక వెళ్ళి కొలంబోలోని సిటీ కాలేజీలో పొలిటికల్ ఎకనమిక్స్ ప్రత్యేక విషయంగా చదివి కేంబ్రిడ్జి సీనియర్ పరీక్షల్లో నెగ్గారు. కొంతకాలం రైల్వేలో గార్డుగా పనిచేశారు. ఆ ఉద్యోగానికి రాజీనామా చేసి లాహోర్‌లోని డి.ఏ.వి.కాలేజీలో చేరి, సంస్కృతం, ఉర్దూ, జపాన్ భాషల్లో మంచి పాండిత్యం సంపాదించారు. జపాన్ భాషలో అనర్గళంగా మాట్లాడే వెంకయ్యగారిని 'జపాన్ వెంకయ్య'అనేవారు.

## వ్యవసాయ శాస్త్ర పరిశోధన

రైతు కుటుంబంలో జన్మించిన వెంకయ్యగారికి వ్యవసాయంపట్ల ఎంతో అభిరుచి వుండేది. ఆయన కాంగ్రెస్ సభలకు తరుచుగా వెళ్ళేవారు.1908 లో దాదాభాయి నౌరోజీ అధ్యక్షతన జరిగిన కాంగ్రెస్ సభలకు వెళ్ళారు.

ఆ సభల్లోనే ముక్త్యాల రాజా నాయని రంగారావు బహద్దూర్ గారి పరిచయం కల్గింది. వ్యవసాయ రంగంలో అప్పటికే పరిశోధనలు సాగించిన వెంకయ్యగారితో పరిశోధనశాల నెలకొల్పారు. అమెరికా నుండి కంబోడియా ప్రత్తి విత్తనాలు తెప్పించి ప్రత్తిని పండించిన ఘనత వెంకయ్యగారికే చెల్లు. 1907నుండి1910వరకు మునగాలలో ఉంటూ 'వ్యవసాయ శాస్త్రం' అనే గ్రంథాన్ని వ్రాశారు. అప్పుడాయనను 'ప్రత్తి వెంకయ్య' అనేవారు. వెంకయ్యగారికి, బ్రిటన్‌లోని రాయల్ అగ్రికల్చరల్ సొసైటీ సభ్యత్వం లభించింది.

వెంకయ్యగారు బందరులోని జాతీయ కళాశాలలో 1911 నుండి 1919 వరకు అధ్యాపకులుగా పని చేశారు. వ్యవసాయ శాస్త్రం, చరిత్రలతో పాటు విద్యార్థులకు గుర్రపుస్వారీ, వ్యాయామం, సైనిక శిక్షణ ఇచ్చేవారు. ఈనాడు ప్రభుత్వం ప్రవేశ పెట్టిన 'ఎన్.సి.సి.' శిక్షణోద్యమానికి 75 ఏళ్ళ క్రితమే శ్రీకారం చుట్టిన మహనీయుడు పింగళి వెంకయ్యగారు. అప్పట్లోనే చైనా జాతీయ నాయకుడైన 'సన్‌యెట్‌సేన్ 'జీవిత చరిత్ర వ్రాశారు.

## త్రివర్ణ పతాకం

1921లో విజయవాడలో (బెజవాడ)అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సమావేశాలు జరిగాయి. గాంధీజీ కోరిక మేరకు వెంకయ్యగారు జాతీయ పతాకాన్ని తయారు

చేసి ఇచ్చారు. 1921లోనే కాంగ్రెస్ సంస్థ ఈ పతాకాన్ని కాంగ్రెస్ పతాకగా ఆమోదించింది.

22.7.1947న భారత రాజ్యాంగసభ ఈ పతాకాన్ని ఆమోదించింది. నెహ్రూ సలహామేరకు త్రివర్ణ పతాకంలో రాట్నానికి బదులుగా 'అశోక చక్రం' ఉంచబడింది.

క్రమంగా వెంకయ్యగారు రాజకీయాల నుండి దూరమయ్యారు. మద్రాసు వెళ్ళి ప్రెసిడెన్సీ కాలేజీలో భూగర్భ శాస్త్రంలో పరిశోధనలు చేసి 'డిప్లొమా'తీసుకొన్నారు. తర్వాత నెల్లూరు చేరి 1924 నుండి 1944 వరకు అక్కడే ఉంటూ మైకా (అభ్రకం) గురించి పరిశోధన చేశారు. వజ్రకరూరు (అనంతపురం జిల్లా)హంపీ మున్నగు చోట్ల ఖనిజాలను అన్వేషిస్తూ ప్రభుత్వానికి ఖనిజాల ఉనికిని గురించిన నివేదికలు పంపారు.

అంతవరకు బొగ్గు వజ్రంగా మారుతుందనుకొనేవారు. ప్రపంచంలో మొదటిసారిగ వజ్రపుతల్లి రాయిని కనుగొన్న పరిశోధకులు వెంకయ్యగారే. ఈ తల్లిరాయిని గురించి వెంకయ్యగారు ఆంగ్లంలో గ్రంథం వ్రాశారు. పాశ్చాత్య శాస్త్రజ్ఞులు వెంకయ్యగారి ప్రతిభా విశేషాలను ఎంతగానో కొనియాడారు. ప్రజలు వెంకయ్యగారిని 'వజ్రాల వెంకయ్య 'అన్నారు.

## వ్యక్తిగా వెంకయ్యగారు

దేశభక్తి భావనా సంపన్నులైన వెంకయ్యగారు, దక్షిణాఫ్రికానుండి వచ్చిన తర్వాత ఉత్తభారతదేశంలోని రహస్య విప్లవ సంఘాల్లో అయిదేళ్ళకుపైగా పని చేశారు. భారతదేశాన్ని పారిశ్రామికంగా జపాన్‌తో దీటుగా పెంపొందించాలని ఆశించారు.

వెంకయ్యగారు ఆరడుగుల ఎత్తుండేవారు. నల్లని రంగులో ఉక్కు మనిషిలా ఉండేవారు. కంచులాంటి కంఠస్వరం, నిష్కళంక దేశభక్తుడు. అవినీతిని, అన్యాయాన్ని ఏ మాత్రం సహించేవారు కాదు.

పింగళి వారు మహారాష్ట్ర ప్రాంతం నుండి ఆంధ్రదేశానికి వలస వచ్చినవారు. పింగళి మోరు పంతు వంశీయులు. వీరనారి ఝాన్సీ లక్ష్మీబాయి పింగళివారి ఇంటి ఆడపడుచు. నైజాం నవాబు వద్ద మహాసేనానిగా పనిచేసిన పింగళి మాదన్నగారి వంశీయుడే వెంకయ్యగారు.

ఆయన ఏనాడూ ఏ పదవినీ ఆశించలేదు. కాని ఆయన నిస్వార్థ సేవను ప్రభుత్వం గుర్తించకపోవడం విచారకరం. మన జాతికొక కేతనాన్ని నిర్మించినవాడాయన. ఇతర దేశాలలో జాతీయ పతాక నిర్మాతలను ఆ ప్రభుత్వాలు ఎంతగానో గౌరవిస్తాయి. వారికి కావలసిన వసతులను ప్రభుత్వాలే ఉచితంగా సమకూరుస్తాయి. మన ప్రభుత్వం వెంకయ్యగారిని గుర్తించకపోవటం శోచనీయం, జాతీయపతాకాన్ని గురించి ప్రభుత్వం ప్రచురించిన పుస్తకంలో, మన పతాక నిర్మాత ఒక తెలుగువాడు అని వ్రాశారే కాని, వెంకయ్యగారి పేరును సూచించకపోవడం విచారకరం.

తెలుగువారు తమ వారిని గౌరవించటంలో ఏనాడూ ముందంజవేయలేదు.

జీవితాంతం దేశం కొరకు స్వాతంత్ర్యం కొరకు పోరాడిన వెంకయ్యగారు చివరి

రోజుల్లో తిండికి కూడా మొహం వాచి నానా అగచాట్లు పడినట్లు 'త్రివేణి 'సంపాదకులు డా. భావరాజు నరసింహారావుగారు పేర్కొన్నారు. అంతిమదశలో విజయవాడలో డా. కె.ఎల్.రావు, డా. టి.వి.ఎస్.చలపతిరావు, కాట్రగడ్డ శ్రీనివాసరావు. డా. గూడూరు నమశ్శివాయ మున్నగు పెద్దలు 15.1.1963న వెంకయ్య గారిని సత్కరించి వారికి కొంత నిధిని అందించారు. ఆ సత్కారం తర్వాత అరు నెలలకే 4.7.1963వ తేదీన వెంకయ్యగారు దివంగతులయ్యారు.

కన్నుమూసేముందు వారి చివరి కోరికను వెల్లడిస్తూ "నా అంత్య దశ సమీపించింది. నేను చనిపోయిన తర్వాత త్రివర్ణ పతాకాన్ని నా భౌతిక కాయంపై కప్పండి. శ్మశానానికి చేరిన తర్వాత ఆ పతాకం తీసి అక్కడ ఉన్న రావి చెట్టుకు కట్టండి. ఇది నా తుది కోరిక "అన్నారు.

జాతీయ పతాకం ఎగిరే వరకు స్మరించుకోదగిన ధన్యజీవి పింగళి వెంకయ్యగారు.

మహామనీషి

# రఘుపతి వెంకటరత్నం నాయుడు



బౌద్ధమతం బోధించిన దయాగుణం, క్రైస్తవ మతం బోధించిన సేవా పరాయణత్వం పుణికి పుచ్చుకొన్న మహనీయుడు ఆచార్య రఘుపతి వెంకట రత్నం నాయుడుగారు. విద్యావేత్తగా, సంఘ సంస్కర్తగా, పవిత్రతకు సంకేతంగా వెలిగిన నాయుడుగారు 'బ్రహ్మర్షి 'గా సుప్రసిద్ధులు.

నాయుడుగారు 1862 అక్టోబరు 1వ తేదీన మచిలీపట్నంలో జన్మించారు. వారి తండ్రి రఘుపతి అప్పయ్యనాయుడుగారు. తాతగారైన వెంకటరత్నం గారు మద్రాసు సైన్యంలో అధికారులుగ పనిచేసినవారు. తల్లిగారైన శేషమ్మ విష్ణుభక్తురాలు. ఆమె సుగుణ సంపన్నురాలు. పవిత్రుడైన మానవుని కుల మతాలను గురించి పట్టించుకోరాదు అనే వారామె.

తండ్రి అప్పయ్య నాయుడు సుబేదారుగ పనిచేస్తూ చాలాకాలం ఉత్తర భారతంలో వుండేవారు. బాల్యం నుండి ఆ ప్రాంతంలో వున్నందున నాయుడుగారికి హిందీ, ఉర్దూ పర్షియన్ భాషలలో చక్కని పరిచయం కల్గింది. తండ్రి అప్పయ్య నాయుడు గారికి హైదరాబాద్ బదిలీ కావటం వల్ల వెంకటరత్నంగారు చాదర్‌ఘాట్‌లోని నిజాం ఉన్నత పాఠశాలలో చదువు సాగించారు. ఆ పాఠశాలలో సరోజిని నాయుడు తండ్రి అఘోరనాథ్ ఛటోపాధ్యాయ గారి వద్ద నాయుడుగారు శిష్యరికం చేశారు. మద్రాసు

క్రైస్తవ కళాశాలలో డా. మిల్లర్ అంతేవాసిగ అధ్యయనం సాగించారు.

సంఘం ఆధ్యాత్మికంగా ముందంజ వేయాలని విశ్వసించిన నాయుడుగారు సూఫీ వేదాంతాన్ని, హిందూ క్రైస్తవ మత సిద్ధాంతాలను బాగా ఆకళించుకొన్నారు. అసాధారణమైన జ్ఞాపకశక్తి గల నాయుడుగారు ఆంధ్రాంగ్ల భాషలలో అనర్గళంగా ఉపన్యసించేవారు.

కందుకూరి వీరేశలింగం పంతులుగారి సాహచర్యం కారణంగా విధవా వివాహాలను బలపరచసాగారు. బ్రహ్మసమాజ సిద్ధాంతాల పట్ల శ్రద్ధాసక్తుల కారణంగా విశ్వైక మత ప్రచారానికి, మానవతా ప్రబోధానికి కంకణం కట్టుకొన్నారు.

1884లో బి.ఎ. మొదటి సంవత్సరం విద్యార్థిగా వున్నపుడే శేషమాంబ గారిని వివాహం చేసుకున్నారు. 1889 లో ఆమె ఆడబిడ్డను ప్రసవించి మరణించారు. ఆమె మరణించిన తర్వాత నాయుడుగారు మరలా వివాహం చేసుకోలేదు. ఆనాటి నుండి హిందూ వితంతువుల మాదిరిగా వుండాలని సదా తెల్లటి దుస్తులే ధరించేవారు. అందు వల్లనే నాయుడుగారిని 'ఆంధ్ర దేశ శ్వేతాంబర ఋషి'అనేవారు.

నాయుడుగారు ఏలూరు సి.యం.ఎస్. హైస్కూలులోను, రాజమండ్రి, బందరు పట్టణాలలోని హైస్కూళ్ళలోనూ ఉపాధ్యాయులుగా, ప్రధానోపాధ్యాయులుగా పని చేశారు. 1891 లో ఎం.ఎ.(ఆంగ్ల సాహిత్యం) పట్టు భద్రులై కొంతకాలం మద్రాసు పచ్చియప్ప కాలేజీలో ఆంత్రోపాలజీ ఇంగ్లీషు ప్రొఫెసర్‌గా పనిచేశారు.

1904 లో పిఠాపురం రాజావారి కళాశాల ప్రిన్సిపల్‌గా పదవీ స్వీకారం చేశారు. కళాశాలలో స్త్రీలకు, దళిత జాతుల విద్యార్థులకు ఉచితంగా విద్య నేర్పబడేది. 1911 లో మొట్టమొదటి సారి బాలికలను కళాశాలలో చేర్చి సహవిద్యకు మార్గ దర్శకులైనవారు నాయుడుగారు.

1905 నుండి 1929 వరకు పి. ఆర్. కళాశాల ప్రిన్సిపాల్‌గా నాయుడుగారు గొప్ప సేవలందించారు. మహారాణిగారు కళాశాలకు కావలసిన భవనాలకు లక్షలు విరాళం గాను, 35ఎకరాల స్థలం క్రీడలకు గాను దానం చేశారు. కళాశాలలో వారికి గల సాన్నిహిత్యం గురించి చెబుతూ, "నా హృదయాన్ని అరంగుళం చీల్చి చూడండి అక్కడ మీకు పిఠాపురం రాజా కళాశాల కనిపిస్తుంది."అన్నారు.

1925లో నాయుడుగారు మద్రాసు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా నియమింప బడినారు. ఆంధ్ర విశ్వవిద్యాలయ బిల్లును రూపొందించి శాసన మండలిచే ఆమోదింప చేసిన మహనీయులు వెంకట రత్నం నాయుడుగారు. 1927లో ఆంధ్ర విశ్వ విద్యాలయం మొదటి పట్ట ప్రదానోత్సవంలో నాయుడుగారిని గౌరవ డాక్టరేట్ పట్టముతో సత్కరించింది.

నాటి ఆంగ్ల ప్రభుత్వం నాయుడుగారిని దివాన్ బహదూర్, కైజర్-ఇ-హింద్, 'సర్ 'బిరుదాలతో గౌరవించింది.

ఆయన దయామయుడు. ఎందరో అనాథ బాల బాలికలను చేరదీసి వారికి

విద్యాబుద్ధులు గరిపించారు. 1936లో ఒకే నెలలో బీద విద్యార్థులు చదువుకు 1500 రూపాయలు అందజేశారు.

నాయుడుగారు"పీపుల్స్ ఫ్రెండ్, ఫెలో వర్కర్స్"అను ఆంగ్ల పత్రికలకు సంపాదకత్వం వహించి సాంఘిక సమస్యల మీద ఉత్తేజకరమైన వ్యాసాలు వ్రాశాడు.

అస్పృశ్యతా నివారణకోసం ఉద్యమాన్నే నిర్వహించారు. బ్రహ్మ సమాజ సిద్ధాంతాలలో ప్రముఖులైన కుల వ్యవస్థ నిర్మూలనకు కృషి చేస్తూ, వర్ణాంతర వివాహాలను జరిపించారు.

ఆనాడు ఆంధ్ర దేశంలో ప్రబలంగా వున్న 'వేశ్యావృత్తి ' నిర్మూలనకు గొప్పగా కృషి చేశారు. శుభ కార్యాలలో విధిగా ఏర్పాటు చేస్తూ వుండిన భోగము మేళములను అంతరింపజేశారు. కళావంతుల సంఘములను స్థాపించి వేశ్యావృత్తి నిషేధానికి ముమ్మరంగా కృషి చేశారు. వారి కృషి వల్లనే ప్రభుత్వం వేశ్యావృత్తిని నిషేధించే చట్టాన్ని అమలు పరచింది.

మద్య నిషేధ ఉద్యమం సాగించారు. 1923లో మద్రాసు రాష్ట్ర శాసన మండలి సభ్యులుగా వున్నపుడు మద్య నిషేధం బిల్లు ప్రవేశపెట్టనందుకు ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించారు.

నేటి జీవన విధానంలో సమాజంలోని ఇతర వ్యక్తుల కంటే ఉపాధ్యాయుడు ఎక్కువ చైతన్య వంతుడు కావాలని, ఉపాధ్యాయులు 'విమోచన సేన'గా ఉద్యమించాలని ఉద్బోధించేవారు.

సాంఘిక పవిత్రతా సంఘం నెలకొల్పి ఆ సంఘ సభ్యులకు క్రింది నియమాలను విధించారు.

1) వేశ్యలు పాల్గొను సమావేశాలను వెళ్ళరాదు. వారిని ప్రోత్సహించరాదు. అశ్లీలమైన పాటలను పాడటం, వినటం సాహిత్య పఠనం చేయరాదు. శారీరక, మానసిక పవిత్రత్వాన్ని పెంపొందించుటకు కృషి చేయాలి.

ఈ విధంగా యువతలో శీల సంపదను పెంపొందించుటకు కృషి చేశారు. తమ నెలసరి ఆదాయంలో సొంతఖర్చులకు అతి స్వల్పంగా వుంచుకొని బీద విద్యార్థులకు ఆర్థిక సహాయం అందచేసేవారు. తమ గురుదేవులైన డా. మిల్లర్ పేర మద్రాసు విశ్వవిద్యాలయంలో ప్రతి ఏటా విజ్ఞాన ప్రచారానికి పదివేల రూపాయల నిధిని ఏర్పాటు చేశారు.

'అపర సోక్రటీసు'గా ఆంధ్ర ప్రజల మన్ననలందుకున్న రఘుపతి వెంకట రత్నం నాయుడుగారు సంపూర్ణ జీవితం గడిపి 1939 మే 26వ తేదీన దివంగతులయ్యారు.

## కవికోకిల

# జాషువా



కులం – మతం అనే సంకుచిత భావాలు పాముల్లా బూసగొట్టుతున్న కాలమది. అంటరానితనం కరకరలాడుతున్న పాడుకాలమది.

వినుకొండ వీధిలో ఒక బాలుడు నడుస్తున్నాడు. అగ్రవర్ణానికి చెందిన మరో బాలుడు ఆ వీధిన పోతూ, 'నన్ను తాకకు దూరంగా పో'అని ఈసడించుకున్నాడు. ఆ అవమానాన్ని భరించలేక ఆ బాలుడు తన ఆవేదనను తల్లి ముందు తోడుకున్నాడు. తల్లి బాలుని కన్నీటిని తుడిచింది. తన కళ్ళల్లో నీళ్లుబుకుతున్నా తమాయించుకొంది. అంటరాని వారిగ పరిగణింపబడిన ఆ బాలుడే పెరిగి పెద్దవాడై 'నవయుగ కవి చక్రవర్తి'అని కీర్తింపబడినాడు. అతడే కవికోకిల గుర్రం జాషువా.

జాషువా కవి 1895 అక్టోబర్ 28న వినుకొండలో జన్మించారు. తండ్రి వీరయ్య క్రైస్తవ మతమును స్వీకరించిన యాదవుడు. తల్లి లింగమ్మ ఆది ఆంధ్ర కులమునకు చెందిన మహిళ, వారిది బీద కుటుంబము.

ఉన్నత పాఠశాల చదువు ముగించి ఉపాధ్యాయ శిక్షణ పూర్తి చేశారు. 1915-16లో రాజమండ్రిలో, మూకీ చిత్రాల కథావాచకుడుగా పనిచేశారు. కొంత కాలం సత్యవోలు సున్నేశ్వరరావుగారి, 'చింతామణి నాటక మండలి' లో నాటకకర్తగా పనిచేశారు. 1919 నుండి 1929 వరకు గుంటూరులోని లూథరన్ చర్చి వారి ఉపాధ్యాయ శిక్షణా

సంస్థల్లో అధ్యాపకులుగా పనిచేశారు. 'ఉభయ భాషా ప్రవీణ' పట్టం పుచ్చుకొన్న జాషువా గారు 1928–42 మధ్య గుంటూరు జిల్లా బోర్డు పాఠశాలల్లో తెలుగు పండిత పదవి సాగించారు. 1942–45 మధ్య, బ్రిటిష్ ప్రభుత్వ యాజమాన్యంలో భారత ప్రభుత్వం నెలకొల్పిన జాతీయ యుద్ధ ప్రచారక సంఘంలో ప్రచారకులుగా పనిచేశారు. 1957–59 మధ్య మద్రాసు ఆకాశవాణి కేంద్రంలో 'ప్రొడ్యూసర్' గా ఉద్యోగం నిర్వహించారు. 1964 లో ఆంధ్ర ప్రభుత్వం జాషువా గారిని శాసనమండలికి నామినేట్ చేసింది.

ఏ ఉద్యోగం చేసినా అది జీవికకు మాత్రమే సాధనం. ఆయన జన్మతః కవి. కాని కవిగా బ్రతుకు సాగించడం అసాధ్యమని 'బడిపంతులు'అయ్యారు.

చిన్నప్పుడు వినుకొండలో కొప్పరపు సుబ్బారావుగారి అవధానం విన్నాడు. అవధానం ముగిసిన తర్వాత కొందరు కవులు అవధానిని ప్రశంసిస్తూ పద్యాలు చదివారు. బాలజాషువా కూడా పద్యాలు వ్రాసుకొని, చదవటానకి వేదిక నెక్కాడు. 'అంటరాని వారు వేదిక ఎక్కడమా ? పద్యాలు వ్రాయటమా?' అని తరిమివేయటం, బాలజాషువా ను ఎంతగానో కృంగదీసింది.

జాషువాగారు అకుంఠిత దీక్షతో కావ్యరచన కుపక్రమించారు.

'విశ్వమానవ సౌభ్రాతృత్వం, నిర్మత, నిర్జాతి సంఘం నా ఆదర్శం. ఒక జాతికి ఒక మతానికి చెందిన కవిత్వాలు మంచివి కావు. అవి కవిత్వాలేకావు. అలాంటివి వీలునామా కవిత్వాలు అంటాను. నా భావం సామాన్యులకు అందివ్వడానికే ప్రయత్నించాను. గహన సంచారం లేని కవిత్వం నా లక్ష్యం 'అన్నారాయన.

'నవ్యయుగోచితంబులై ఆకటి చిచ్చు లార్పు హృదయ విదారి దయా కథాంశాలు' ఆయన కవితకు వస్తువులు. మానవత్వం, హేతువాదం జాషువా గారి కవితలకు మూలాధారాలు.

కరుణరసం ఆయన కవితల్లో తొణికిసలాడుతుంది.

'కరుణ రసమొకండె కఠిన రాక్షసముల్
హృదయములను గలచిముదముగూర్చు
వేడికంటె నీటి విలువ సహజమైన
చలువలీను అశ్రువులకు లేదు'
అన్నారు 'ముసాఫిర్'అనే కావ్యంలో.
'కఠిన చిత్తుల దురాగతములు ఖండించి
కనికారమొలకించుకలమునాది'
అని ఎలుగెత్తి చాటారు.
"నిమ్నజాతుల కన్నీటి నీరదములు
పిడుగులై దేశమును కాల్చివేయునని" హెచ్చరించారు.

అస్పృశ్యులు పండించే ధాన్యం ఆలయాలలో దేవునికి నైవేద్యంగా సమర్పిస్తున్నారు. కాని ఆ ధాన్యం పండించే కృషికులకు ఆలయ ప్రవేశం కూడా లేదు అంటూ:

ప్రతిమల పెండ్లి సేయుటకు వందలు వేలు వ్యయించు గాని
దుఃఖితమతులైన పేదల ఫకీరుల శూన్యములైన పాత్రలన్
మెతుకువిదల్పదీ భరతమేదిని :ముప్పది మూడు కోట్లదే
వతలెగవడ్డ దేశమున భాగ్యవిహీనుల క్షుత్తులార్తురే '

అంటూ ధనవంతుల అపవ్యయాన్ని ఎండగట్టారు.

దీనుల పట్ల, సంఘం అణచివేసిన వారి పట్ల అపారమైన సానుభూతితో కలంకదలించిన కవి జాషువాగారు. సంఘ సంస్కరణ ఆయన కావ్య లక్ష్యం; ఆకలిని, శోకాన్ని నిర్మూలించాలన్నదే ఆయన ధ్యేయం. అంధ విశ్వాసాలను, మత విద్వేషాలను తీవ్రంగా నిరసించారు. చిత్తశుద్ధిలేని పెత్తందార్లను, గుత్తస్వాములను నిలదీసి ప్రశ్నించాలంటూ

"ముసుగులో గుద్దులాటలు పొసగవింక హక్కు గలదయ్య ప్రశ్న సేయంగ నిన్ను" అంటూ దేవుణ్ణే నిలదీసి ప్రశ్నించాడాయన.

జాషువాగారు అభ్యుదయ వాది. వర్గ సంఘర్షణ, ఆర్థిక వ్యత్యాసాల నిర్మూలన, దోపిడీ వర్గాలపై తిరుగుబాటు జాషువాగారి కావ్యాలలో నిండుగా వున్నాయి. రేడియోలో వస్తున్న కవితలను విమర్శిస్తూ, అన్నార్తుల ఆక్రందనను తన కవితలో యిలా వినిపించారు.

'రేయిబవలు భారతీయ సంస్కృతి పేర
గండశిలలు చూపి కథలు చెప్పి
కటిక పేదవాని కడుపులోగల చిచ్చు
గడపగలవె నీవు గగనవాణి'

ఆస్తి అందరిదీ కావాలని కొందరికే పరిమితం కారాదనీ ఆయన అభిమతం.

స్వరాజ్యం సంపాదించి మూడేళ్ళు గడచినా ప్రజల బ్రతుకులు మారలేదేమి? అంటూ,

'మారు పల్కవేమి మంతిరన్నా'అని నిలదీసి అడిగారు.

జాషువాగారు సంకుచిత తత్వాలను ఖండిస్తూ, 'నిఖిలలోకమెట్లు నిర్ణయించిన నాకు తిరుగులేదు విశ్వనరుడనేను' విశ్వజనీనమైన దృక్పథం గల వాడాయన.

గబ్బిలం పట్ల జాలిని చూపుతూ,

"నరుని కష్టపెట్టి నారాయణుని గొల్చు
ధర్మశీలురున్న ధరణి మీద
కాలుమోపలేక గబ్బిలమొక్కటే
చరణ యుగళిదివికి సాచి నడుచు."

'స్మశాన వాటిక'లోని ప్రతి పద్యం మన గుండెలను పిండుతుంది.

ఇచ్చోట ; నే సత్కవీంద్రుని కమ్మని

కలము, నిప్పులతో గలిగిపోయె
యిచ్చోట ; నేభూములేలు రాజన్యుని
యధికార ముద్రికలంతరించె
యిచ్చోట ; నేలేత ఇల్లాలి నల్లపూసల
సౌరు, గంగగలసిపోయె
యిచ్చోట ; నెట్టి పేరెన్నికంగొన్న
చిత్రలేఖకుని కుంచియనశించె
'ఇది పిశాచులలో నిటలేక్షణుండు
గజ్జెగదలించి యాడురంగస్థలంబు
ఇది మరణదూత తీక్షణ దృష్టులొలయ
నవని పాలించు భస్మసింహాసనంబు'

జాషువాగారి రచనలన్నీ ఖండకావ్యాలు. వాటిలో పిరదౌశి, గబ్బిలము, కాందిశీకుడు, ముంతాజమహల్, స్వప్నకథ, నేతాజీ, క్రీస్తు చరిత్ర, కొత్తలోకము ప్రసిద్ధములైనవి. ఆత్మ కథను మూడు సంపుటాలుగా 'నా కథ' అను శీర్షికన వ్రాశారు.

జాషువా కవి కర్ణుని తలపింపజేస్తారు. 'కర్ణుండేమాయె కులపరీక్షకులనడుమ?'అని ప్రశ్నిస్తారు.

కురు కుమారుల సభలో, కర్ణునికి జరిగిన అవమానమే కవితా సదస్సులో తనకు జరిగిందన్నారు. సూర్యారావు బహదూర్‌గారి దర్శనం తర్వాత, కవి కులాన్ని గూర్చిన ప్రశ్న రావటం జాషువాగారి నెంతగానో బాధించింది.

'నా కవితా వధూటి వదనంబు నెగాదిగజూచి, రూప రే
ఖా కమనీయ వైఖరుల గాంచి, 'భళీ భళీ' యన్నవాడే 'మీ
రేకుల' మన్న ప్రశ్న వెలయించి చివుక్కునలేచిపోవుచో
బాకున క్రుమ్మినట్లగును పార్థివ చంద్ర; వచింప సిగ్గగున్'
అని ఆవేదన చెందారు.

ప్రతిభను కులమతాలతో కొలవటం తీవ్రంగా ఖండించారు.

జాషువాకవి జంతువుల పట్ల, పక్షుల పట్ల ఎంతో దయగలవారు.

ఒకమారు ఆయన వార్ధాకు గాంధీజీ దర్శనం కోసం వెళ్ళారు. అక్కడున్న ఒక రాజకీయ నాయకుడు జాషువాగారిని, ఒక జర్మన్ పండితునికి పరిచయం చేస్తూ 'ఈయన క్రైస్తవ కవి' అన్నాడట. ఆ విదేశీ పండితుడు ఆశ్చర్యంతో, ఆ నాయకునివైపు చూశాడట. కవితకు కులమతాల ముద్రలు వద్దంటారాయన. జాషువాగారు, గోపరాజు రామచంద్రరావు (గోరా)గారితో వియ్యమందుకొన్నారు.

గుంటూరులోని భూస్వామి ఏకా ఆంజనేయులుగారు జాషువగారికి ఒక ఎకరా సుక్షేత్రమైన పంటభూమిని దానంగా ఇచ్చారు. మిత్రులు వారెకొక ఇల్లు కట్టించి ఇచ్చారు. కనకాభిషేకాలు, గజారోహణాది సత్కారాలు, గండపెండేరాలు మున్నగు

సత్కారాలెన్నో అందుకున్నారు. భారత ప్రభుత్వం 'పద్మ భూషణ'తో గౌరవించింది. 1970 లో ఆంధ్రవిశ్వ విద్యాలయం 'కళా ప్రపూర్ణ'ప్రశస్తినిచ్చింది. కవికోకిల, కవితావిశారద, నవయుగ కవి చక్రవర్తి మున్నగు బిరుదములనిచ్చి సత్కరించారు రసజ్ఞులు.

అనాటి ఆస్థానకవి చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రి కవిగారు స్వయంగా గండపెండరము తొడగటంతో జాషువాగారెంతో సంతోషించారు.

సమకాలీన కవితాలోకంలో అందరి మన్ననలందుకొన్న జాషువా మహాకవి 24-7-1971న కన్నుమూశారు.

చిరస్మరణీయుడు

# సర్ థామస్ మన్రో
# (1761-1827)

'ప్రజల పట్ల నిజాయితీలో కూడిన సానుభూతిగల సునిశిత మేధావి'అని కార్ల్ మార్క్స్‌చే ప్రశంసలందుకొన్న పరిపాలకుడు సర్ థామస్ మన్రో.

వ్యాపారులుగా వచ్చి మన దేశంలో స్థిరపడి దేశాన్ని దోచుకున్నారు ఆంగ్లేయులు. వారిలో అధిక సంఖ్యాకులు అవినీతిపరులు. అక్రమార్జనాపరులు, అహంకారులు. ప్రజల పట్ల ఏ మాత్రం అభిమానం లేనివారు.

కారుచీకట్లలో వెలుగురేఖలవలె కొందరు నిజంగా మన దేశాన్ని ప్రజలను ప్రేమించారు. మన సంస్కృతి పట్ల గౌరవంతో వ్యవహరించారు.

ప్రధానంగా తెలుగు ప్రజలు మరువరాని తెల్లదొరలలో అగ్రగణ్యుడు సర్ థామస్ మన్రో. రాయలసీమ వాసులకు ఆపద్బాంధవుడు మన్రో.

రాయలసీమ తరతరాలుగా అనావృష్టికి గురియైన ప్రాంతం. ప్రకృతి వైపరీత్యానికి తోడుగా, పిండారీల దోపిడులు, పాళెగాండ్ర దురాగతాలు సీమ ప్రజలను నానా యాతనలకు గురిచేసేవి. అశాంతితో పరితపిస్తున్న ప్రజానీకాన్ని ఆదుకొని, సీమలో శాంతిభద్రతలను నెలకొల్పిన మహనీయుడు మన్రో.

1792లో జరిగిన శ్రీరంగపట్నం సంధి ప్రకారం కడప, అనంతపురం, కర్నూలు, బళ్ళారి నిజాం పాలనలోనికి వచ్చాయి. నిజాం పాలనలో అరాచకం మరింత పెరిగింది. పాలెగాళ్ళ అక్రమాలకు అంతులేకపోయింది. కడపజిల్లాలోని వేముల పాళెగాడు తనను తాను రాజుగా ప్రకటించుకొన్నాడు. కొరవలు, యానాదులు, బేడర్లు, ఎరుకలు గ్రామాలపై బడి దోచుకోసాగారు. అట్టి పరిస్థితులలో 12-10-1800న దత్త మండలాల ప్రధాన కలెక్టరుగా మన్రో నియమింపబడినాడు. అతని క్రింద నలుగురు సబ్ కలెక్టర్లు వుండేవారు. ఆదవాని, హర్పనహళ్ళి, కడప, కంబంలలో వీరి కార్యాలయాలు వుండేవి. మన్రోకు సహాయంగా మేజర్ జనరల్ డుగాల్డ్ క్యాంబెల్ నాయకత్వంలో ప్రధాన కేంద్రాలలో సైనిక దళాలుండేవి. అనంతపురం డివిజన్ మాత్రం మన్రో అధీనంలో వుండేది.

సిద్దవటంలో వున్న కడప జిల్లా కార్యాలయం 1812 లో కడపకు మార్చబడింది. 1828లో కంబం, దూపాడు, కోయిల కుంట్ల ప్రాంతాలను కడప జిల్లా నుండి విడదీసి కర్నూలు జిల్లాగా ఏర్పాటు చేశారు.1911లో మదనపల్లి, వాయల్పాడు ప్రాంతాలను కడపజిల్లా నుండి విడదీసి చిత్తూరు జిల్లాగా ఏర్పాటు చేశారు.

సర్ థామస్ మన్రో ఈస్టిండియా కంపెనీ వారి మద్రాసు సైన్యంలో ఒక సైనికుడు. కుటుంబ పరిస్థితుల వల్ల ఉన్నత విద్య పూర్తి చేయలేక, కంపెనీ కొలువులో చేరాడు. జీతం తక్కువైనా సర్దుకొనేవాడు. ఎర్స్ కిన్ అనే మిత్రునికి వ్రాసిన జాబులో యిలా అన్నాడు.

భారతదేశానికి వచ్చేదాక నాకు, ఆకలి దప్పులు, అలసట, బీదరికం అంటే ఏమిటో తెలియదు. ఇక్కడ మొదటి రెండూ నాకు అప్పుడపుడు అనుభవంలోకి వస్తుండగా మూడవది మాత్రం నన్ను నిత్యం వెంటాడుతూ వుండేది.

మొదటి మూడు సంవత్సరాల కాలంలో రాత్రిపూట తన పుస్తకాలను తలగడగానూ, నాలుగు కర్రలపై పరచిన కాన్వాస్ గుడ్డ పరుపుగాను, వేసుకొనే కోటు దుప్పటిగాను ఉపయోగించినట్లు, మిత్రునికి 23–7–1789లో వ్రాసిన జాబులో పేర్కొన్నాడు. పదేళ్ళ పాటు సైనికుడుగా మంచిపేరు సంపాదించాడు. రెవిన్యూ విధానాన్ని రూపొందించుటలో శిక్షణ పొందాడు. 18వ శతాబ్ది చివర ల్యాండ్ సెటిల్ మెంట్ నిర్వహణకు దక్షిణ కన్నడ ప్రాంతానికి పంపబడినాడు.

మన్రో నిజాయితీపరుడు. ప్రజల నుండి, రైతుల నుండి ఎట్టి కానుకలు స్వీకరించేవాడు కాదు. మన్రోకు స్వాగతమివ్వటానికి ఒక గ్రామాధికారి తన గ్రామంలో పెద్ద పందిరి వేయించాడు. అందుకు కూలీలకు పైసా యివ్వలేదని తెలుసుకున్న మన్రో,పందిరి వద్దకైనా వెళ్ళక, చెట్టునీడన చిన్న డేరాలో మకాం చేశాడు. రైతుల నుండి పాలు, పళ్ళు కూడా ఉచితంగా తీసుకొనే వాడు కాదు. తన క్రింది అధికారులను కూడా అలాగే వుండనిచ్చేవాడు.

రైతుల నుండి ఎక్కువ శిస్తులు వసూలు చేయటం న్యాయం కాదన్నాడు. భూసంబంధమైన చట్టాల ముందు, బీదలు, ధనికులు అన్న తేడా వుండరాదన్నాడు. ఎవరైనా సరే తనకున్న భూమినంతటినీ తనకున్న వనరులతో సాగు చేసుకోవచ్చునన్నాడు. అంత వరకు గ్రామ ప్రాంతాలలో భూముల మీద వున్న అగ్రవర్ణాల వారి పెత్తనంపై చావు దెబ్బతీశాడు. భూమి ప్రభుత్వ ఆస్తి, నిర్ణీత శిస్తుపై రైతులకు కౌలుకు యివ్వాలని ఆదేశించాడు. రాయలసీమ ప్రాంతంలో తానున్న ఏడేళ్ళకాలంలో మన్రో 2,06,819పట్టాలను రైతులకు అందజేశాడు. రైతులకు భూమిపై సర్వహక్కులు వుంటాయని ప్రకటించాడు. ఇందువల్ల భూమిసాగు గణనీయంగా పెరిగింది. ప్రభుత్వాదాయం పెరిగింది.

ఉదారమైన భూమిశిస్తును ప్రకటించడం మన్రో గొప్పదనానికి నిదర్శనం. రైతు తన ఫలసాయం నుండి 2/3 వంతు మిగుల్చుకొన్నపుడే భూమి విలువైన ఆస్తి కాగలదన్నాడు మన్రో. 1807 లో అన్నిరకాల భూముల మీద 25 శాతం పన్ను తగ్గించాడు. రైతులు తవ్వుకొన్న బావులు, చెరువుల మీద అదనంగా 8 1/3 శాతం పన్ను తగ్గింపుకు సిఫారసు చేశాడు. ఈ విధానాన్ని 1820లో మద్రాసు గవర్నర్‌గా చేరిన తర్వాత అమలుచేశాడు.

1807లో మన్రో కలెక్టర్ పదవికి రాజీనామా చేసి లండన్ చేరాడు. మద్రాసు ప్రభుత్వం రైత్వారి విధానాన్ని రద్దు చేసి గ్రామీణ శిస్తు విధానాన్ని అమలుపరచింది. శిస్తు ఒక సంవత్సరం నుండి మూడేళ్ళపాటు వసూలు చేసే హక్కు గ్రామపెద్దకు లభించింది. మరల అగ్రవర్ణాల ఆధిపత్యం మొదలైంది. 1820 లో మద్రాసు గవర్నర్‌గా వచ్చిన మన్రో పాతవిధానాన్ని అమలు చేశాడు.

ఆ కాలంలో రాయలసీమలో 80 మంది పాలెగాళ్ళుండేవారు. వీరిలో కడప జిల్లాలోని వేముల, చిట్వేలి, పోరుమామిళ్ళ, నరసాపురం, అప్పిరెడ్డిపల్లి, ఉప్పలూరు, కమలాపురం పాలెగాళ్ళు ముఖ్యులు. వీరు నిరంకుశులు. గ్రామాలను దోచుకునేవారు. బందిపోట్లుగా వారి అనుచరులుండేవారు. హైదరాలీ, నిజాం, గోల్కొండ నవాబులు కూడా వారిని అరికట్టలేకపోయారు. మన్రో తీవ్ర చర్యలతో వీరి ఆట కట్టించాడు. పాలెగాళ్ళను, కావలి వాళ్ళను కఠినంగా శిక్షించాడు.

అరాచకంగా వున్న రాయలసీమ జిల్లాల్లో జిల్లా కోర్టులు, పోలీసు యంత్రాంగాలు ఏర్పాటు చేశాడు. మన్రో కఠినచర్యల వల్ల సుస్థిరమైన పాలన ఏర్పడింది. పాలనాపరమైన సంస్కరణలను ప్రవేశపెట్టాడు.

1813 లో ఛార్టర్ చట్టానికి సంబంధించిన పార్లమెంటు కమిటీ ముందు సాక్ష్య మిస్తూ, భారతదేశ సంస్కృతిని అనుసరించటం వల్ల ఇంగ్లండు లాభపడుతుందన్నాడు. భారతీయులు తయారుచేయు వస్తువుల నాణ్యత, యూరప్‌తో సమానమైనదన్నాడు. భారతదేశ ప్రజల పట్ల, మేధావుల పట్ల, చేతి వృత్తుల వారిపట్ల ఎంతో గౌరవముండేది.

భారతీయులు తెలుగు, ఇంగ్లీష్ భాషలు నేర్చుకొని ప్రభుత్వ ఉద్యోగాలు పొందటా నికి వీలుగా జిల్లా తాలూకా స్థాయిలో పాఠశాలలు నెలకొల్పారు. 1805 నాటికే మన్రో తెలుగు వ్రాయను, చదవనూ నేర్చుకొన్నాడు. రాయలసీమ రైతులతో ఆయన తెలుగులోనే మాట్లాడేవారు. తన క్రింది అధికారులు కూడా విధిగా తెలుగులోనే ప్రజలతో వ్యవహరించాలని ఆదేశించాడు. సి.పి. బ్రౌన్ ఆయన మాటలనెంతగానో గౌరవించేవాడు.

భూస్వాములు రైతులకు అన్యాయం చేస్తున్నట్లు వార్త వచ్చిన వెంటనే వారి వద్దకు వెళ్ళి వారి కష్టసుఖాలను విచారించేవాడు. మైళ్ళ తరబడి కాలినడకన గ్రామాలను చూచేవాడు. పూడిపోయిన చెరువులు కనబడిన వెంటనే పూడిక తీయించే ఏర్పాటు చేసేవారు.

మన్రో భారతీయులను పెద్ద పదవులలో నియమించాడు. ధర్మవరం ప్రాంతం వాడైన, దేశాయి నారాయణప్పను 800 రూపాయల నెలవేతనంపై మద్రాసు రెవిన్యూ బోర్డు దివానుగా నియమించాడు. మైసూరు దివాన్ పూర్ణయ్యవద్ద శిక్షణ పొందిన బచ్చేరావును 700 రూపాయల జీతంపై హుజూరు శిరస్తదారుగ నియమించాడు. బచ్చేరావు కార్యదక్షతను గుర్తించి కడప తాలూకాలోని పుట్లంపల్లె, పులివెందుల తాలూకాలోని ఇడుపులపాయ గ్రామాలను జాగీరుగా యిచ్చాడు.

గండి క్షేత్రంలోని ఆలయం దర్శించాడు. కొండలోయ మధ్య అతనికి బంగారు తోరణం కన్పించిందట. అది పరమభక్తులకే కనిపిస్తుందని నమ్మకం. చూచినవారు ఆరుమాసాలకు మించి బ్రతకరన్న నమ్మకం వుండేది. ఏదెట్లున్నా సర్ థామస్ మన్రో, ఆరునెలల్లోనే పత్తికొండలో కలరా సోకి 7–7–1827న మరణించాడు. ఆయన శరీరాన్ని గుత్తి పట్టణంలో ఖననం చేశారు. ఆయనపేర నేటికీ గుత్తిలో సత్రం ఉంది.

రాయలసీమ రైతుల పాలిట పెన్నిధిగా ప్రశంసింపబడిన మన్రో శిలా విగ్రహాన్ని పత్తికొండ తాలూకా కార్యాలయం ఎదుట స్థాపించారు.

తాడిపత్రిలోని చింతల రాయస్వామి ఆలయ ఆస్థాన మంటపాన్ని, కళ్యాణ మంటపాన్ని మరమ్మతు చేయించాడు. ఆలయంలో సక్రమంగా పూజలు జరిపే ఏర్పాటు చేశాడు. రాయదుర్గంలోని ప్రసన్న వేంకటేశ్వరస్వామిని దర్శించాడు. ఆలయానికి మాన్యాలిచ్చాడు.

1807లో బళ్ళారి–మైసూరు సరిహద్దు తగాదా వచ్చింది. సరిహద్దు గ్రామాల ప్రజలు పరస్పరం కొట్టుకున్నారు. వారిలో దెబ్బతిన్న వాడొకడు. 'అనంతపురం వెళ్ళి అయ్యకు చెబుతాను'అన్నాడు. ఆ అయ్య సర్ థామస్ మన్రోయే. ప్రజలు ఆయనను 'మండ్రోలప్ప''మండ్రోలయ్య'ని పిలిచేవారు. మాండవ్య ఋషి అంశం కలవాడంటారు.

ప్రజల మన్ననలందుకుని, రైతు జనబాంధవుడిగా నివాళులందుకొన్న సర్ థామస్ మన్రో చిరస్మరణీయుడు.

మన చరిత్రకు మహోపకారం చేసిన

# కల్నల్ కాలిన్ మెకంజీ

'పురుషులందు పుణ్యపురుషులు వేరయా'అన్నాడు మన వేమన.

ఆంగ్లేయులు మన దేశాన్ని మూడు వందల ఏళ్ళు పాలించారు. ఇంగ్లండు నుండి వచ్చిన అధికారులలో దాదాపు 90 శాతం మన దేశాన్ని దోచుకున్నారు.

తక్కిన 10 శాతం కొందరు మాత్రం మన దేశాన్ని, మన భాషలను సంస్కృతిని గౌరవించారు. మన ప్రజలను ప్రేమించారు. ఆ కొందరే వేమన అన్నట్లు పుణ్య పురుషులని చెప్పవచ్చు. ఆ కొందరు మనం మరవరాని, మరవకూడని వారు, వారెవరు? వారిలో ముఖ్యమైన వారెవరు? తెలుగు ప్రజలు మరవరాని వారిలో

మొదటి ఆంగ్లేయుడు సర్ థామస్ మన్రో. అతడు శాంతిభద్రతలను సుస్థిరమొనర్చి, రైతులకు ఎంతగానో సహాయపడినాడు.

అగ్నిపురుగులకు ఆహారం అవుతున్న తెలుగు కావ్యాలను వేలాదిగా సేకరించి శుద్ధ ప్రతులు వ్రాయించి, నిఘంటువులను సమకూర్చి తెలుగు సాహిత్యానికి మహోపకారం చేసిన దొర సి.పి.బ్రౌన్. గోదావరిపై ఆనకట్ట కట్టించి, మరెన్నో జలాశయాలు నిర్మింపజేసి లక్షలాది ఎకరాలను సస్యశ్యామలం కావించిన అన్నదాత సర్ ఆర్థర్ కాటన్.

మన చరిత్రకు కావలసిన ముడి సరుకును సమకూర్చి, మెకంజీ కైఫియత్‌లుగా పేరుగాంచిన అమూల్యమైన చరిత్రలను మనకు అందించిన మహనీయుడు కల్నల్ కాలిన్ మెకంజీ.

మెకంజీ స్కాట్లండుకు పడమరగా వున్న లూయీ అనే ద్వీపంలోని స్టార్నొవే అన్న గ్రామంలో క్రీ.శ. 1754లో జన్మించాడు. తండ్రి మర్డాక్ మెకంజి. తల్లి బార్బరా మెకంజి. తండ్రి చిన్న వ్యాపారాలు చేస్తూ తన గ్రామంలో పోస్టు మాష్టారుగా వుండేవాడు.

స్టార్నొవేలోని బడిలో చదువు సాగించాడు కాలిన్ మెకంజీ. గణితంపట్ల ఆసక్తి ఎక్కువగా వుండేది. కొంతకాలం స్టార్నొవేలోనే పన్నులు వసూలు చేయు ఆఫీసులో గుమాస్తాగా పనిచేశాడు మెకంజీ. జాన్ నేపియర్ అను సంపన్నుడు మెకంజీని తనకు సహాయకుడుగా వేసుకొన్నాడు. నేపియర్ పూర్వీకులలో గొప్పవాడైన జాన్ నేపియర్ చరిత్ర వ్రాయుటకు కావలసిన ఆధారాలన్నీ సేకరించాడు.జాన్ నేపియర్ గణిత శాస్త్రమునకు చాలా అవసరమైన 'సంవర్గమానములు'లో గరిథమ్స్‌కనిపెట్టాడు. విషయ సేకరణలో మెకంజీ అతనికి బాగా తోడ్పడినాడు. అప్పుడే భారతీయ గణిత శాస్త్ర విషయం తెలుసుకొన్నాడు.

నేపియర్ చనిపోయిన తర్వాత మెకంజీ 1782 లో మదరాసుకు వచ్చాడు.

ఈస్టిండియా కంపెనీ వారు ఇతనికి ఇంజనీరింగ్ శాఖలో ఉద్యోగమిచ్చారు. నేపియర్ అల్లుడు శామ్యూయల్ జాన్‌స్టన్ అపుడు మధురలో కంపెనీ ఉద్యోగిగా వుండేవాడు. జాన్‌స్టన్ కోరికమేరకు మధురలో కొంతకాలం వున్నాడు. అచటి పండితులలో స్నేహం చేసి భారతదేశ చరిత్రకు కావలసిన కొంత సామగ్రిని సంపాదించాడు.

ఇంజనీరింగ్ శాఖలో ఉద్యోగి కావున కంపెనీ వారి సైన్యంతోపాటు దిండిగల్లు, కోయంబత్తూరు మున్నగు చోట్ల పనిచేశాడు. 1784–90 సం.ల మధ్య సర్కారు – రాయలసీమ ప్రాంతాలలో పని చేశాడు. నెల్లూరు నుండి తూర్పు కనుమల ద్వారా రాయలసీమ ప్రాంతానికి రహదారి మార్గాల నమూనాలతో దేశపటాలు తయారు చేశాడు. కొంతకాలం గుంటూరు ప్రాంతంలో పని చేశాడు. తన పనిని ఎంతో శ్రద్ధతో, తెలివితేటలతో చేసినందుకు మెచ్చుకొన్న కంపెనీవారు మెకంజీని గుంటూరు సీమ సర్వే చేయుటకు 1790లో అధికారిగ నియమించారు. 1792 లో టిప్పుసుల్తాన్ యొక్క శ్రీరంగపట్నంపై కారన్ వాలిస్ దాడి చేశాడు. అప్పుడు మెకంజీ కంపెనీ సైన్యపు ఇంజనీర్‌గా పని చేశాడు. కారన్ వాలిస్, మెకంజీని దత్త మండలాల (నేటి రాయలసీమ)తో పాటు నెల్లూరు సీమ సర్వే చేయుటకు నియమించాడు. రాయలసీమ నెల్లూరు ప్రాంతాలకు సంబంధించిన దేశపటాన్ని, నైసర్గిక పటాన్ని మొట్ట మొదట తయారు చేసిన వాడు మెకంజీ.

ఈ సర్వే పనులలో భాగంగా దేశమంతా సంచారం చేశాడు. సుందరమైన దేవాలయాలను చూచాడు. శాసనాలపట్ల ఆసక్తిని మరింత పెంచుకొన్నాడు. ఆ కాలంలోనే ఏలూరులో వుండిన కావలి వెంకట సుబ్బయ్యగారి కుమారులతో మెకంజీకీ పరిచయం కలిగింది. వారు వెంకట నారాయణ, వెంకట బొర్రయ్య, వెంకట రామస్వామి, సీతయ్యగార్లు. వీరిలో బొర్రయ్య గొప్ప తెలివితేటలు గలవాడు. మెకంజీ యువకుడైన బొర్రయ్య సహాయంతో తెలుగు, కన్నడ శాసనాలలోని విషయాలను తెలుసుకొన్నాడు. గ్రామ చరిత్రలు వ్రాయుటకు, తాళపత్ర గ్రంథాలను సేకరించుటకు చరిత్రకుపయోగించు నాణెములను సేకరించుటకు బొర్రయ్యకు వేతన మిచ్చి వినియోగించుకొన్నాడు. బొర్రయ్య 27 ఏళ్ళ ప్రాయంలోనే చనిపోయాడు. ఆ వయస్సులోనే బొర్రయ్య చాలా విషయాలు సేకరించాడు. బొర్రయ్య తమ్ముడు లక్ష్మయ్య మెకంజీకి సహాయకుడయ్యాడు.

1810 లో మెకంజీ మదరాసు ప్రాంతసర్వేయర్ జనరల్ గా నియమింపబడినాడు. 1811–15 లో జావా ద్వీప ఆక్రమణకు వెళ్ళిన సైన్యంలోని ఇంజనీర్లకు అధికారిగ వెళ్ళాడు.

1816లో భారతదేశపు మొదటి సర్వేయర్ జనరల్‌గా నియమింపబడినాడు.

1793 నుండి 1816 వరకు దక్షిణ భారత దేశంలో ఉద్యోగం చేసినపుడు మెకంజీ తాళపత్ర గ్రంథాలు, వ్రాతపత్రులు 1560 వరకు సేకరించాడు. ఇదికాక అతని సేకరణలో ప్రధానమైనవి.

1) స్థానిక చరిత్రలు :2070
2) శాసన పాఠాలు :8076
3) దేశ పటాలు :79
4) బొమ్మలు :2630
(డ్రాయింగ్స్)
5) నాణెములు :6218
6) శిల్ప చిత్రాలు :106
7) పురాతన వస్తువులు :40

మెకంజీని గురించి చెప్పేటప్పుడు బొర్రయ్యను మరవలేము. కంపెని కొలువు కోసం బొర్రయ్య మచిలీపట్నంలో హిందూ స్తాని, పర్షియన్, ఆంగ్లభాషలను బాగా నేర్చుకున్నాడు. జైనుల వృత్తాంతం, మొఘలుల తర్వాత కర్ణాటక మందలి సంఘటనలు అను రచనలను ఆంగ్లంలో చేశాడు. మెకంజీ బొర్రయ్య నెంతగానో అదరించాడు. తన ఆస్తిలో కొంత భాగం బొర్రయ్యకు చెందునట్లు వీలునామా వ్రాశాడు. బొర్రయ్య తమ్ముడు కావలి వెంకట రామస్వామి మొట్టమొదటిసారి దక్కన్ కవుల జీవిత చరిత్రలు వ్రాశాడు. తెలుగు కవుల జీవిత చరిత్రలను గ్రంథస్థం చేసిన వారిలో మొదటి వాడాయన.

మెకంజీ సొంత పైకం 15 వేల రూపాయలు ఖర్చుచేసి తాళపత్రాలు, శాసనాలు, నాణెములు మున్నగువాటిని సేకరించాడు. మెకంజీ సేకరణలను అతని మరణానంతరం కంపెని పరంగా వారన్ హేస్టింగ్స్ 10 వేల డాలర్లకు కొన్నాడు.

మెకంజీ కృషి వల్లనే అమరావతిలో బౌద్ధ స్థూపమున్న విషయం వెల్లడైంది. 1792లో అమరావతిని దర్శించిన మెకంజీ వెంకటాద్రి నాయుడు గారిని కలుసుకొని, అమరావతి స్థూపముయొక్క వర్ణనను ఏషియాటిక్ సొసైటీ వారి సంపుటాలలో ప్రచురించాడు. హైందవ విజ్ఞాన మందిరానికి కావలి బొర్రయ్య అను మహాద్వారము నాకు లభించెనని మెకంజీ వ్రాశాడు.

వారన్ హేస్టింగ్స్ సంస్కృతం, అరబ్బి, పారసీ, జాపనీస్, బర్మీస్ భాషలలోని తాళ గ్రంథాలను, శిల్పాలు, నాణెములు మున్నగు వాటిని ఇంగ్లాండుకు పంపాడు. దక్షిణ భారత దేశ భాషలలోని స్థానిక చరిత్రలు, తాళ పత్రాలు మున్నగునవి 5,31,255. ఇవన్నీ మద్రాసు ప్రాచ్య లిఖిత భాండాగారంలో భద్ర పరచబడినాయి. దాదాపు 40 ఏళ్ళు మన చరిత్రకు కావలసిన వస్తు సామాగ్రిని సేకరించాడు. ప్రపంచ చరిత్రలో అన్ని చారిత్రక పరికరాలు సేకరించినవారు మరొకరు లేరు. మెకంజీ 1821లో కలకత్తాలో చనిపోయాడు. నలభై ఏళ్ళ తర్వాత మెకంజీ సేకరించిన కైఫీయత్తులలో చాలవాటికి శుద్ధ ప్రతులు వ్రాయించి ఆ గ్రంథాలను మన కిచ్చిన మరో మహనీయుడు సి.పి.బ్రౌన్.

# లోకమాన్య బాలగంగాధర తిలక్



"స్వరాజ్యం నా జన్మ హక్కు. స్వరాజ్య చైతన్యం జాగృతంగా వున్నంతకాలం నేను యువకుణ్నే! నా విశ్వాసాలను ఏ అస్త్రమూ ఛేదింపజాలదు. ఏ అగ్ని దహింపజాలదు. ఏ ప్రవాహం కూడా దానిని కొట్టుకొని పోజాలదు. ఏ ప్రభంజనమూ పెకలింపజాలదు. నా దేహానికి ముసలితనం వచ్చినా, నా చైతన్యానికి ముదిమిరాలేదు. " అంటారు 'హోమ్ రూల్'ఉద్యమాన్ని ప్రారంభించుటకు ముందు స్వాతంత్ర్య సమర శంఖారావం పూరించిన అప్రతిమ దేశభక్తుడు లోకమాన్య బాలగంగాధర తిలక్.

మహారాష్ట్రంలోని రత్నగిరిలో తిలక్ 1856 జులై 23వ తేదీన జన్మించాడు. పార్వతీబాయి, గంగాధర రామచంద్ర తిలక్ అతని తల్లితండ్రులు. తండ్రి గంగాధర తిలక్ సంస్కృతంలోను, ఆంగ్లంలోను, గణితంలోను పాండిత్యం సంపాదించి, విద్యాశాఖలో 'అసిస్టెంట్ డిప్యూటీ డైరెక్టర్ ' అయ్యాడు.

బాలగంగాధర తిలక్ పూనాలోని దక్కన్ కాలేజిలో చేరి, గణిత శాస్త్రమును ప్రత్యేక విషయంగా చదివి ఇరువదవ యేట పట్టభద్రుడయ్యాడు. ఎం.ఏ. చదవాలనుకొన్నాడు. కాని వీలుకాలేదు. ఎల్.ఎల్.బి.పట్టా పుచ్చుకున్నాడు. విద్యావ్యాప్తి తన కర్తవ్యమని భావించిన తిలక్ 1880లో 'న్యూ ఇంగ్లీష్ స్కూల్'అను పాఠశాలను ప్రారంభించాడు. 1885 దక్కన్ ఎడ్యుకేషన్ సొసైటీని స్థాపించి గవర్నర్ ఫెర్గుసన్ పేర కళాశాల ప్రారంభించాడు. గోపాలకృష్ణ గోఖలే ఆ కళాశాలలో ఆంగ్ల

భాషాధ్యాపకుడుగా పనిచేసేవాడు.

సాంఘిక సేవారంగ ప్రవేశం చేసి, విద్యావకాశాల మెరుగుదలకు విస్తృతంగా పనిచేశారు. రాజకీయ నాయకుడుగా, పాత్రికేయుడుగా బహుముఖంగా దేశానికి సేవచేసే భాగ్యం ఆయనకు కల్గింది. తిలక్ ముప్పదిమూడేళ్ళ ప్రజాహిత సేవరంగంలో ఎనిమిదేళ్ళు కారాగారంలో గడిపాడు. 1908లో 'కేసరి'పత్రికలో ప్రభుత్వాన్ని విమర్శిస్తూ వ్యాసం వ్రాశాడన్న కారణంతో 52ఏళ్ళ బాలగంగాధరతిలక్‌గారికి ఆరేళ్ళు దీర్ఘకాల శిక్ష విధించింది నాటి ప్రభుత్వం.

మహ్మద్ ఆలీ జిన్నా, తిలక్‌ను 'హామీ'పై విడిపించవలసినదిగా, న్యాయమూర్తి దాపర్‌కు అర్జీ పంపుకున్నాడు. ఒకప్పుడు తిలక్‌ను ప్రభుత్వం నిర్బంధించినపుడు తిలక్ పరంగా వాదించిన, దాపర్ మహాశయుడు, న్యాయమూర్తి పదవిని చేపట్టిన తర్వాత బ్రిటిష్ వారి తొత్తుగా మారి జిన్నా చేసిన విజ్ఞప్తిని తిరస్కరించాడు. తిలక్‌పై దేశద్రోహ నేరమారోపించింది ప్రభుత్వం. తిలక్ న్యాయస్థానంలో తన నిర్దోషిత్వమును రుజువు చేసికొనుటకు తన వాదమును నిరూపించిన తీరు అతని న్యాయశాస్త్ర ప్రతిభకు అద్దం పట్టింది. ఆయన వాదనను వినుటకు ప్రతిదినం ప్రజలు కోర్టు ఆవరణలో మూగేవారు. రాత్రి 9 గంటల వరకు విచారణ సాగించిన దావర్, లోకమాన్యుని ఉద్దేశించి "నేను శిక్ష విధించుటకు ముందు నీవేమైనా చెప్పదలచు కొన్నచో చెప్పవచ్చు"అన్నాడు. తిలక్ ధీర గంభీర వదనంతో, "అయ్యా తాము నన్ను దోషిగా తీర్మానించవచ్చు. కాని నేను ముమ్మాటికీ నిర్దోషిని. ఇది నా దృఢవిశ్వాసం. నేను స్వేచ్ఛగా వున్నప్పటికంటే జైలు శిక్ష అనుభవించుటవల్లనే నా ఉద్యమం మరింత విజయవంతంకాగలదు. అదే దైవనిర్ణయమైతే అలాగే కాని"అన్నాడు. న్యాయాధిపతి తిలక్‌కు వేయి రూపాయల జరిమానా, ఆరేళ్ళ ద్వీపాంతరవాస శిక్ష విధించాడు. దేశం ఆ తీర్పు విని ఆగ్రహించింది. కాని దాస్యంతో మ్రగ్గుతున్న వారపుడేమి చేయగలరు?

మాండలే జైలులో వున్నపుడే తిలక్ భగవద్గీతపై గొప్ప వ్యాఖ్యానం వ్రాశాడు. అదే 'గీతా రహస్యం.' కర్మ చేయుటమే మన ప్రధాన ధర్మమన్నారు. ఆ వ్యాఖ్యతో ఆ గ్రంథం ప్రపంచ విజ్ఞుల మన్ననలందుకొన్నది.

1914 జూన్ 8వ తేదీన మాండలే జైలు నుండి తిలక్‌ను తీసుకొనివచ్చి అర్ధరాత్రివేళ పూనాలోని వారి ఇంటిలో దిగబెట్టింది ప్రభుత్వం. తెల్లవారేసరికి, తిలక్ విడుదల వార్త దేశమంతటా వ్యాపించింది. ప్రజల ఆనందానికి అవధులు లేకపోయాయి.

1916 జూలై 23వ తేదీన లోకమాన్యుని షష్టిపూర్తి ఉత్సవాలు ఎంతో వైభవంగా జరిగాయి. ఆ సందర్భంగా మాట్లాడుతూ "నా వంటి సామాన్యుని సేవతో మీరు తృప్తిపడరాదు.... మీరు భేదాలను మరచి జాతీయ వీరసోదరులుగా ఉద్యమించాలి. ఇచట అహంకారానికి, భయానికి తావుండదు. మన తరములో కాకున్నా మన తరువాత తరము వారికైనా విజయం నిశ్చయం. "అన్నాడు.

తిలక్ ప్రజలలో రాజకీయ చైతన్యంతో పాటు మన ధర్మంపట్ల శ్రద్ధాసక్తులను ప్రబోధించాడు. శివాజీ ఉత్సవాలను, గణపతి ఉత్సవాలను సంఘటితం కావించి ప్రజలలో నవచైతన్యాన్ని రేకెత్తించాడు.

1896లో మహారాష్ట్ర ప్రాంతంలో కరువు వ్యాపించినపుడు, ఆ తర్వాత ప్లేగ్ వ్యాధి వేలాది ప్రజలను పొట్టన పెట్టుకొన్నపుడు తిలక్ సాగించిన ప్రజాసేవా కార్యక్రమాలు చిరస్మరణీయమైనవి. తిలక్ గాంధీజీతో రాజకీయంగా విభేదించాడు. కాని స్వాతంత్ర్య సమరంలో ఒకే బాటపై నడిచారు.

జీవితాంతం అలుపెరుగక పోరాడిన లోక మాన్యుడు 1918 ఆగష్టు ఒకటవ తేదీన రాత్రి గం. 12.40ని॥లకు ప్రశాంతంగా కన్ను మూశాడు. గాంధీజీ తన 'యంగ్ ఇండియా ' పత్రికలో తిలక్‌కు శ్రద్ధాంజలులర్పిస్తూ "తిలక్ మహాశయుడు సాధించిన అనురాగం, పలుకుబడి మన కాలంలో మరే నాయకుడు సాధించలేదు. ఆయన ప్రజలకు ఆరాధ్య దైవం, మానవులలో మహోన్నత మూర్తి అస్తమించాడు. భారతదేశమంతటికీ లోక మాన్యుడైన తిలక్ మహాశయుని ధైర్యం, నిరాడంబరత్వం, త్యాగం, మాతృదేశాభిమానం మనమలవరచుకొని ఆయనకు మన హృదయంలో చెక్కు చెదరని స్మృతి చిహ్నం నిలుపుకొందాం"అన్నాడు గాంధీజీ.

తిలక్ భౌతిక కాయాన్ని స్వయంగా భుజంపై మోయాలని గాంధీజీ ముందుకు వెళ్ళినపుడు "బ్రాహ్మణులు మాత్రమే"అతని శవవాహకులుగా వుండాలన్నారు. ప్రజా సేవకుడికి ఆ నియమాలు వర్తింపవని గాంధీజీ శవవాహకుడయ్యాడు.

తిలక్ సంస్కరణవాదియైన మహామానవుడు పదునారేళ్ళ వయసు పూర్తి అయిన తర్వాతనే మహిళలకు వివాహం జరపాలని, 40ఏళ్ళ వయసు మీరిన పురుషులు వివాహం చేసుకోదలచిన వితంతువులనే వివాహమాడ వలెనని, వరకట్నం తీసుకోరాదని, మద్య పానం విసర్జించాలని, సంఘ సేవకులు తమ ఆదాయంలో ఒక శాతాన్నైనా సంఘ సేవకు వినియోగించాలని బోధించాడు.

లోకమాన్యుడు 30ఏళ్ళపాటు కేసరి, మరాఠా పత్రికలను నిర్వహించి భారతీయ పత్రికోద్యమానికి నవోత్తేజం కలిగించాడు. ప్రజా సమస్యల నిరూపణకు పత్రికలు వేదికలు కావాలన్నాడు. పత్రిక ఎట్టి పరిస్థితులలోనైనా సకాలంలో వెలువడాలన్నది ఆయన లక్ష్యం.

ఒకమారు 'కేసరి' పత్రిక సంపాదకీయం వ్రాస్తుండగా, కొడుకు ప్లేగు వ్యాధికి గురై మరణించాడు. ఏమాత్రం చలించని తిలక్ పత్రికను సకాలంలో వెలువరించాడు. కఠోరమైన నియమ పాలకుడాయన. 36 గంటలు నిర్విరామంగా పనిచేస్తూ పత్రికను వెలువరించిన రోజులెన్నో ఆయన జీవితంలో. అచ్చు పనిలో అన్ని విభాగాలపై ఆయనకు పట్టు వుండేది.

తిలక్ జైలులో వున్నప్పటికీ పత్రిక సకాలంలో వెలువడుతుండేది. ఉపసంపాదకులకు ఆయన ఇచ్చిన శిక్షణ అట్టిది! అది అమూల్యం. తమ పత్రిక ఉపసంపాదకులనుద్దేశించి

వ్రాస్తూ "మీ రచనా శైలి పల్లె ప్రజలతో మాట్లాడినట్లుండాలి. విద్యావంతులతో మాట్లాడిన రీతిగా క్లిష్టంగా వుండరాదు. కఠిన, పదాలను, సంస్కృత పదాలను వాడ కండి " అనేవారు.

తిలక్ 'ఒరాయన్','ఆర్కిటిక్ హోమ్ ఇన్ ది వేదాస్','గీతా రహస్య 'అను ఉద్గ్రంథాలను వ్రాశాడు.

తనకు అపకారం చేసిన వారికి కూడా ఉపకారం చేసిన మానవతావాది తిలక్. 'జ్ఞాన ప్రకాశ 'అను పత్రిక 'కేసరి' పత్రికకు బద్ధ విరోధి. రెండు పత్రికలూ ఒకే ప్రెస్‌లో ముద్రితమవుతుండేవి.

ఒకమారు అనివార్య పరిస్థితులలో 'జ్ఞానప్రకాశ్'మేనేజర్ తిలక్‌గారి వద్దకు వచ్చి 'అయ్యా ఈనాడు మా పత్రికలో సంపాదకీయం వ్రాసేవారెవరూ లేరు. దయచేసి మీరు వ్రాసిస్తారా 'అని కోరాడు. తిలక్ సమ్మతించి వ్రాసివచ్చాడు. విభిన్న ధోరణులు గల పత్రికలు అవి. కాని, మరుసటి రోజున ఆయా పత్రికల ధ్యేయానికి అనుగుణంగా సంపాదకీయాలు వ్రాయబడినాయి!

హిందూ–ముస్లిమ్ తగాదాలు తలయెత్తినపుడు 'కేసరి'పత్రికలో ఇలా వ్రాశారు. "భారతదేశంలో హిందువులు, ముస్లిములు శతాబ్దాలుగా సమైక్య భావంతో మెలగుతున్నారు. వారి హక్కులు ఏనాడో నిర్ణయింపబడినాయి. ప్రభుత్వం పక్షపాత ధోరణిని అవలంబించటం వల్ల వైమనస్యాలు తలయెత్తుతున్నాయి. ఈ తగాదాలన్నిటికీ ప్రభుత్వమే కారణం"అన్నారు.

భారతజాతిని స్వాతంత్ర్య సమరోత్సాహంతో జాగృతమొనర్చిన మహానేత లోక మాన్య బాల గంగాధర తిలక్.

## రచయిత గురించి



పేరు : **జానమద్ది హనుమచ్ఛాస్త్రి**

జననం : 5-9-1926, రాయదుర్గం, అనంతపురం జిల్లా.

జననీజనకులు : జానకమ్మ, సుబ్రహ్మణ్యశాస్త్రి.

విద్యాయోగ్యతలు : ఎం.ఏ. (ఆంగ్లం) ఎం.ఏ. (తెలుగు) బి.ఎడ్., రాష్ట్ర భాషా విశారద.

ఉద్యోగం : ప్రభుత్వ విద్యాశాఖలో అధ్యాపకుడుగా - స్కూళ్ళ ఇన్‌స్పెక్టర్‌గా- జిల్లా విద్యా విషయక సర్వే ఆఫీసర్‌గా, కళాశాలలో ఇంగ్లీష్ లెక్చరర్‌గా - 1946 - 1984.

ముద్రిత రచనలు : మా సీమకథలు, కడప సంస్కృతి - దర్శనీయ స్థలాలు, నాట్యకళా ప్రపూర్ణ బళ్ళారి రాఘవ, కస్తూరి - కన్నడ సాహిత్య సౌరభం, గణపతి - వినాయకుని గురించిన పరిశోధనాత్మక గ్రంథం (కన్నడం నుండి తెనిగింపు), మన దేవతలు, రసవద్ఘట్టాలు, దేవుని కడప, విదురుడు, డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్, డా॥ భీమరావ్ అంబేద్కర్, సి.పి. బ్రౌన్ చరిత్ర, మనిషీ నీకసాధ్యమేది (ఆంగ్ల కావ్యానికి తెలుగుసేత).

వివిధ దినపత్రికలలో 2 వేలకు పైగా వ్యాసాల ప్రచురణ - అనేక సాహిత్య సదస్సులలో ప్రసంగాలు - పత్ర సమర్పణ.

సత్కారాలు : అయ్యంకి అవార్డు స్వీకారం, రెండుసార్లు కవిత్రయ జయంతి పురస్కారం, మరెన్నో సత్కారాలు పొందారు.

"శ్రీ హనుమచ్ఛాస్త్రి ఎంతో శ్రమపడి విషయ సేకరణ చేసుకున్నాడు. ఆయన ఏ పనిచేసినా ఓర్పుతో సర్వ విషయ సేకరణ చేసేది ఆయన ప్రత్యేకత. 'ఏదో చేస్తిలే' అనే ఆత్మవంచన చేసుకోడు. తాను వ్రాసే విషయంపై ఎంతో సానుభూతితో గుణదోష వివేచనను మరువని వివేకంతో కలం కదిలిస్తాడు."

**- డా॥ పుట్టపర్తి నారాయణాచార్య**